Book No. 4.

625

SREE

# GANASARAM.

OR

## LECTURES ON HINDU MUSIC

BY

**Betapudy Bhagavanta Row,**

*Author of Rukmangada, Manusambhavam, &c.*

MASULIPATAM.

First Edition—1,000 Copies.

Madras:

PRINTED AT THE ANANDA STEAM PRESS.

*And Published by the Author.*

1909.

*All Rights Reserved,*

Price One Rupee.

శ్రీరస్తు.

# సంగీతోపన్యాసములు

అను నామాంతరము గల

# గానసారము.

శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయము

ఇది

దమపకులయొక్కయు, సంగీతవిద్యార్థులయొక్కయు

ఉపయోగార్థము,

ప్రస్తుతమందు మచిలీపట్టణమున నివసించియుండు,

బేతపూడి భగవంతరావుచే

రచియింపఁబడినది.

ఇందలి

సంగీతభాగము

శ్రీమాన్ తచ్చూరు చిరశింగరాచార్యులవారిచేతను

మ॥ రా॥ రా॥ గరికపర్తి కోటయ్యదేవర గారిచేతను

సాహిత్యభాగము

బ్రహ్మశ్రీ దవలువాడ సుందరరామశాస్త్రులవారిచేతను

పరిష్కరింపఁబడినవి.

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

ఆనంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచేతనే

ప్రకటింపఁబడినది.

1909

కాపీ రైట్సు రిజర్వుడు] [వెల ఒక రూపాయ.

# INTRODUCTION.

BY

**Dr. D. S. Ramachandra Rao,**
**M.A , M B , Ch. B , (Edinburg).**

*Professor, Pachaiyappa's College, Madras*

It is with very great pleasure that I respond to the kind invitation of my friend Mr *B. Bhagavanta Row* to write a few lines of introduction to his little book called "*Ganasaram*. At the out set I feel I cannot do justice to the work before me, as I know so little of the science of music, whether the music be oriental or occidental. The only excuse I have for venturing to recommend this little book to the Telugu speaking people, is the fact that I love the Indian Music and the Telugu Music in particular. I have been long looking forward to the day when the Indian Music would be modernised, and made acceptable to the world at large.

The science of music in India is as wide and as deep as the great ocean. There are very few who could afford the leisure to master the Hindu Music even should they have the talent for it Even when it is learned to perfection, and displayed with exquisite skill, the man in the street does not possess the trained ear to appreciate it. Often the performance of the Hindu Music is over the heads of the audience. As "a man in the street", I object to this state of things. I have often derived very great pleasure by attending *concerts* and *operas* in England and France, though I knew nothing of the science of European Music. We, in India, need modernising our music to make it popular.

It is unfortunate the average musician is inclined to be conservative and autocratic and does not evince any desire to fall in with the rapidly changing tastes of the man in the street. But in music as well as in economics, *the supply follows the demand* At present the educated men in this country know so little of the science of the Hindu Music. They are afraid of demanding a change

చెన్నపురవాస్తవ్యులును, స్వయంకృతలక్ష్యసహితసంగీతగ్రంథ
కర్తలును, ప్రఖ్యాత సంగీత విద్వాంసులును అగు బ్రహ్మశ్రీ
తిరువత్తూరు త్యాగరాజాచార్యులవారు ఈ గ్రంథమును
చిత్తగించి యొసఁగిన యభిప్రాయము. 8-1-'09.

మచిలీబందరుపుర వాస్తవ్యులగు మహారాజశ్రీ చేతపూడి భగవంతరావు గారు రచియించిన 'గానసారము' అను గ్రంథము నంతను బరిశీలించి చూచితి ఇందు శ్రుతిలక్షణము, రాగప్రస్తారము, తాళప్రకరణము, పల్లవిపాట, పరీక్షలు మొదలగు ననేక విషయములు మృదుశైలి నుపన్యాసరూపమున ధారాళముగ బోధింపఁబడినవి. ఇటీవలఁ గొందఱు బుద్ధిశాలులు సంగీతమందుఁ గొన్ని గ్రంథములఁ బ్రచురించుచు వచ్చిరి. కాని వానిలో దేనియందును సంగీతశాస్త్రవిషయము లింత బాహాటముగను, సుబోధముగను వ్రాయఁబడ లేదని నా నమ్మకము. వీరు సంగీత సాహిత్యములు రెంటియందును సమర్థులగుటచేతఁ జదువరులకు రుచిపుట్టునట్లును, సుబోధమగునట్లును దీనిని వ్రాసిరి. ఈ గ్రంథము సంగీతవిద్యార్థులయొద్దను, విద్వాంసులయొద్దను, ఇతరవిద్యలలోఁ బండితులగువారియొద్దను, ప్రభువులయొద్దను, ఇంకను జదువనెఱిఁగిన ప్రతివారియొద్ద నుండఁదగియున్నది. అట్టివార లందఱును దీనిఁ జదివి మేలువడయుదురు గాక యని కోరుచున్నాఁడను.



**M. R Ry. Rentala Venkata Subbarow Pantulu Garu,** B.A., B L., High Court Vakil, Madras, and renowned author writes as follows on 19—1—'09.

Many thanks for the copy of your **"Rukmangada Natakam"** which you have been kind enough to give me. I find it delightful reading and have no doubt it richly deserves the patronage it has received and is receiving. The language runs very smooth and ideas are bright and interesting.

I have perused the advance proofs of your work **'Ganasaram'**. It is quite a novel work bristling with original ideas, and in spite of differences of opinion which may excist on minor points

I think everyone will admit that your attempt to popularise Hindu Music is highly commendable. Your advice to professional musicians is sound in principle, and if followed in practice, it is bound to give real life to musical performances and in course of time revive the musical element in every Hindu home. I wish you God-speed in your great undertaking and hope you will soon meet with sufficient encouragement both from professional musicians and the public at large. I hope, too, that others who like yourself, possess a combination of the musical and poetic gifts, will follow your example and facilitate your work.

I have seen your little book **Kavi Mitram**—intended for ready reference on *Arthanuswara* and *Sakatarepha*. It is a real boon to all Telugu writers, if only for its handy size and the great trouble it saves of referring to large, unwieldy works—such as the *Sabda Ratnakara*—printed on flimsy paper. Every student of Telugu ought to possess a copy of this neat little brochure.

Wishing you all success, I remain, Yours very Sincerely.



**M. R. Ry. Sreeman P Sreenivasacharlu Garu,** B.A., B.L., High Court Vakil, University Examiner in Telugu, writes as follows on 24—1—'09.

I went over the first six forms of Mr. *B. Bhagavanta Row's* pamphlet entitled *Gana-Saram* and I found it interesting reading The author's ideas and suggestions are very original and are such as should commend themselves to the due consideration of musical experts. Evidently he wishes to see the songsters and songstresses strive more *to entertain their audience* than to exhibit their skill in permutations and combinations of the swarams. In other words he wishes to make music more popular than it is now by modernising it to suit the present day taste The language in which the discourses are couched is lucid, and technical expressions are clearly explained by apt illustrations and catching phraseology. I would be happy to see the author's endeavours appreciated both by musicians and the musically inclined.



చెన్నపురవాస్తవ్యులగు శ్రీమాన్ ఆయుర్వేద మార్తాణ్డ, భిషజ్మణి, పండిత డి. గోపాలాచార్యులుగారు, ప్రిన్సిపల్ ఏ. వి. యస్., యస్ కె. పి. డి ఆయుర్వేడిక్ కాలీజి, ఈ గ్రంథమును జిత్తగించి దయచేసిన యభిప్రాయము. 26-1-09

మహాశయా !

తాము నాకుఁ బ్రేమతో నిచ్చిన 'గానసారము' అను గ్రంథమును జదివిచూచితి. దీనిలోఁ గొన్ని విషయము లిదివఱకుఁ బ్రచురింపఁబడిన యితరుల గ్రంథములలో నుండినను అవి యొకాండొంటిం జేరక యున్నయవి. తాము ఉపాధ్యాయులును, నాటక వచన రచనా చాతురీధురీణులును, సరసకవులును అగుటచేత సుబోధకంబుగను, శ్రోత్రప్రియంబుగను, మనోరంజకంబుగను, ఉపన్యాససారబోధక పద్య సహితంబుగను, ఈ గ్రంథరాజంబును రచియించినట్టులు కాన్పించుచున్నది

మఱియు "స్వరము సంగీతమున కొక యంగమగునా ? పాఠకుని జ్ఞాన మెందుకు ? అవధానములు. సంగీతకవిత్వము." మొదలగు నిందలి విషయములను ఇంతవఱకెవ్వరును స్వతంత్రముగ వ్రాసియుండలేదని తెలియవచ్చుచున్నది.

ఈ సంగీతశాస్త్రమునఁ దమకుఁ గల స్వతంత్రశక్తిచేత నవీనపద్ధతులతో నిరూపింపఁబడిన యీ గ్రంథమందలి ప్రతివిషయమును సంగీత మభ్యసింపఁదలచిన వారికి అతిసులభమార్గదాయకముగను, సుబోధకముగను, ఉపాధ్యాయుని సాహాయ్యముచేఁ గలుగు జ్ఞానమునకంటె నెక్కుడు జ్ఞానము నిచ్చునదిగను ఉండినది. మఱియు సంగీతమర్మజ్ఞులకు ఆనందజనకముగను, విద్యార్థులకు సుబోధకముగను ఉండుటచే నిది పండితపామరజన రంజకమై యొప్పుచున్నది. ఈ గ్రంథప్రకటనముచే సంగీతసాహిత్యవిద్యాసంఘముల రెంటిని జేర్ప యత్నించుచున్న తమ మహోద్యమంబునకుఁ దోడ్పడ వెనుదీయువార లుండరని నేను దృఢంబుగ నమ్ముచున్నాఁడ.

# పీఠిక.

విద్యాభిమానులారా!

సంగీతశాస్త్రాభిప్రాయములను నే నెఱింగినవఱకుఁ బ్రజల కుపన్యాస రూపంబులఁ దెలియఁబఱుపనెంచి యప్పుడప్పు డచ్చటచ్చట నుపన్యసించుచు వచ్చితి వానిలో నొకటిరెంటిని గతవత్సరంబునఁ గృష్ణాపత్రిక యందుఁ బ్రచురించితి. ఇట్టి యుపన్యాసంబుల మఱికొన్నిటింగూడఁ గూర్చి ప్రచురించినయెడ నివి సర్వజనోపయోగకరంబులుగ నుండు నని మన్మిత్రులు కొందఱు ప్రేరేపించుటచేత దీని నిపుడు గ్రంథరూపముగఁ బూర్తిచేసి ప్రచురించితి

ఇందుఁ బ్రకృతమందు వాడుకలోనుండిన సంగీతమును గూర్చి నాకు దొరకినవఱకు శాస్త్రాధారము గల విషయములనే వ్రాసితి మఱియు నచ్చటచ్చట నాచారమునుండియు, లక్ష్యములనుండియు లక్షణముల గ్రహించినాఁడ. పలుచోట్ల మ దభిప్రాయముల స్పష్టముగఁ జెప్పుచు, మ దనుభవానుసారముగ నూతనమార్గములఁ గూడఁ జూపినాఁడ. ఇట్టి వీనియం దెవ్వరైన భిన్నాభిప్రాయులు కావచ్చును అట్టివారలు తమ యభిప్రాయముల నాకుఁ దెలుపవేఁడెద కానిచోఁ బత్రికాముఖంబున విమర్శింపఁ బ్రార్థించెద ఇందుచేత నా దోషములు వెలుపరింపఁబడినను నా యనంతరము మఱియొక గ్రంథకర్తకైన నీ విమర్శనంబులు తోడుపడుననియు, నందుచే విద్యార్థులకు సంశయనివృత్తి గావించు సమర్థతఁ గల గ్రంథ మొండు వెలువడుననియు నుద్దేశించుటే యీ ప్రార్థనకుఁ గారణము. కాని గోడచాటుననుండి రాయివిసరినట్టులు పేరులేని విమర్శనంబులఁ బ్రకటించుటగాని, ప్రధానవిషయమును ద్యజించి దూషణ వాక్యములతోడ మాత్రము విమర్శనపత్రముల నింపుట గాని వ్యర్థము.

సక్రమమైన విమర్శన మెప్పుడుగాని విద్యాభివృద్ధికిని విషయతత్త్వగ్రహణమునకును సాధనమై యుండును. పెక్కు వివాదాంశములతో నిండియుండిన మన ప్రకృతకాలపు సంగీతవిద్య యిట్టి విమర్శనంబులఁ బెక్కిటి నపేక్షించుచున్నది.

ఈ సంగీతము ప్రకృతస్థితికి వచ్చుటకుఁ బూర్వ మప్పటప్పటికి నొందిన మార్పులఁ గూర్చి యిందు ముచ్చటింప లేదు గ్రంథవిస్తరభీతియు, ననవసరమని తోఁచుటయునే యిందులకుఁ గారణములు.

మనుసంభవము, కవిమిత్రము, గానసారము అను మూఁడుగ్రంథములను ఏకకాలంబున ముద్రణమునకు సిద్ధపఱచుటచేతను, వానిలో నీ గానసారమునే కట్టకడ కతిశీఘ్రకాలంబున రచియించుటచేతను, నిందు ప్రమాదజనితదోషంబులు కొన్ని యుండవచ్చునని సంశయము పొడముచున్నది తమరు సాదరులై యట్టివాని నా కెఱింగించినయెడ వానిని వందనములతోడ నందికొని ద్వితీయముద్రణంబున సవరించుకొనెద.

ఇట్లు,
విద్వజ్జనవిధేయుఁడు.
బేతపూడి భగవంతరావు.

మచిలీపట్టణము,
27-1-09.

# విషయసూచిక.



శ్రీరస్తు.

# గానసారము.



## ఉపోద్ఘాతము.

శ్రీమదఖిలభువన నిర్మాణ రక్షణ నిబర్హణ చణుండగు పరమేశ్వరుని సంకల్పవశంబున దహరాకాశవిహారమాణ మగు పరబ్రహ్మంబునందుఁ దొలుదొల్త నాద మొక్కటి యుద్భవంబయ్యె. అది ధ్వన్యాత్మకమనియు వర్ణాత్మకమనియు రెండువిధము లయినది. ధ్వన్యాత్మకనాదము వీణ, వేణు ఫిడిలు మొదలగు జంత్రములందు మిక్కిలిగఁ బ్రకాశించుచున్నది వర్ణాత్మకనాదము వేదశాస్త్రపురాణాది గ్రంథములందు మిక్కిలిగఁ బ్రకాశించుచున్నది. ధ్వన్యాత్మకనాదమును శాసించునది సంగీతశాస్త్రము అనఁబడుచున్నది. వర్ణాత్మకనాదమును శాసించునది సాహిత్యశాస్త్రము అనఁబడుచున్నది ఈ రెండుశాస్త్రములును విద్యలకెల్ల మూలస్థానమగు సరస్వతీదేవికి అలంకారప్రాయములై యున్నవి. ఈ రెండుశాస్త్రములకు మించిన విషయం బొకటియు జగంబున లేదు ఈ రెండుశాస్త్రములకును అన్యోన్యసంబంధము కలదు ఎట్లనఁగా సంగీతము అలంకారప్రాయమైనది. సాహిత్యము ప్రతిమవంటిది. అలంకారముల నెడఁబాసిన ప్రతిమగాని, ప్రతిమ నెడఁబాసిన యలంకారములుగాని శోభాకరంబులు కాని యట్టులు సంగీతసాహిత్యంబులు నొండొంటి నెడఁబాసి ప్రకాశింపఁజాలవు. కావున నీ యుభయవిద్యాపరిచితి విద్యాభిమానుల కెల్లరకును ఆవశ్యకమగుచున్నది

ఇట్టులుండఁగాఁ బ్రస్తుతకాలంబున లౌకికవిద్యాధికులలో నూటికి ముప్పాతికమంది సంగీతవిద్యాజ్ఞానము లేకయున్నారు మఱియు సంగీతమును వినుటకుఁ గూడ నిచ్ఛలేనివారును వారిలోఁ బెక్కండ్రు కలరు. దీనికిఁ గారణ మేమనఁగా సంగీతమును గూర్చి వారు చదువఁదగిన గ్రంథము లాంధ్రభాషయందు లేవు. అనఁగా స్వరజ్ఞానము వారికి లేదు;

సాహిత్యమందు వేఱుగ దీనింగూర్చి వ్రాయంబడిన గ్రంథములు లేవు. ప్రస్తుతకాలమందలి సంగీతగ్రంథములందు అచ్చటచ్చటం గొన్ని విషయములు శ్లోకశ్లోకార్థరూపంబుల వివరింపంబడియున్నను ఆ గ్రంథములందు విశేషభాగము స్వరాక్షరభరితమై యుండుటచేత "ఈగ్రంథములు గాయకులకొఱకేర్పడినవి కాని మాకొఱకేర్పడినవి కావు" అని వానిని వారు ముట్టనే ముట్టరు. కావున వారికీ విషయములు తెలియనే తెలియవు. ఏరికింగాని కొంచె మెఱింగిన వెనుక మిగిలినదాని నెఱుంగంగోరుట స్వభావసిద్ధము. కాని బొత్తిగం దెలియని విషయములం దేరికిం గాని యపేక్ష యుండునా? అట్టు లుండుట స్వభావవిరుద్ధము. వారు దీనిని విననైన నిచ్ఛయింపకుండుట కిదియే కారణము.

మఱియు సంగీతవిద్యార్థులలోం బెక్కండ్రు చక్కంగం బాడంగలిగియు, సభాసదుల మిక్కిలిగ నానందపఱుపంగలిగియు దీని శాస్త్రార్థముల బొత్తిగ నెఱుంగకయుండుట సంభవించుచున్నది. దీనికిం గారణమేమనంగా ఆ సంగీతవిద్యార్థికి సాహిత్యపరిచితి తక్కువ చదువును సాగించుటకు ధనసాహాయ్యము లేకపోవుటచేతనో, కంఠస్వరమందు మాధుర్య ముండుటచేతనో, ఏ గాయకుని ప్రతిభనో సభాముఖంబునం గాంచి భ్రమించుటచేతనో, సంగీతవిద్యార్థి బాల్యమందే చదువును విడనాడి సంగీతమును బ్రారంభించుచున్నాండు. క్రమముగ నభ్యసించి దీనియందు విద్వాంసుండై సభాముఖంబున కరుదెంచునప్పటికి వీరిలోం గొందఱు నిశానీదారులుగం గూడ నుందురనుటకు సందియ మిసుమంతయు లేదు. ఒకవేళ వారలు బాల్యమందుం జదివిన చదు వెక్కింత జ్ఞప్తియున్నను అంత మాత్రముచేతం బ్రస్తుతకాలపు సంగీతగ్రంథములందు గల వివిధవిషయములం జేర్చి యన్వయించుకొనుటకు వారికిసమర్థత చాలదు వారు సంగీతవిద్యార్థులయ్యు శాస్త్రార్థముల నెఱుంగకయుండుట కిదియే కారణము ఈ కారణముచేత వీరలు తా మెంతశ్రావ్యముగం బాడంగలిగినను, ఎంత నిర్దుష్టముగం బాడంగలిగినను, తమయందు నిక్కమగు దోషము లేకున్నను కొందఱు దంభవిద్వాంసులచేత సభాముఖంబునం బరాభవింపం బడుచున్నారు.

కావుననే పై విద్యాధికులకొఱకు సంగీతపాఠములు లేకుండునట్లును పెక్కుస్థలములం దెక్కుడువిరళముగను, సంగీతవిద్యార్థులకొఱకు శ్లోక శ్లోకార్థములు మిక్కిలిగ లేకుండునట్లును, సులభమగు బోధనక్రమము ననుసరించి యుండునట్లును ఈ గ్రంథము రచియింపఁబడినది. కావున నట్టి విద్యాధికులును, సంగీతవిద్యార్థులును దీనిని సావకాశంబుగఁ బఠించి మేలు నడయుదురుగాక.

గీ. వినుఁడు సంగీత సాహిత్య విద్య లెపుడుఁ
గ్రాలు నన్యోన్య శోభాకరంబు లగుచుఁ
గానఁ జదువరులును మఱి గాన విదులు
నుభయశాస్త్ర ప్రవీణత నొందఁ దగును.





శ్రీరస్తు.

# గానసారము.



## 1. సంగీతవిద్యాలాభము.

లోకమునందుఁ గొందఱు గాయకులు తమ సంగీతమున కితరు లానందింపకుండుటఁ గాంచి "మేము విద్వాంసులము, సంగీతములోని సంగతి మీ కేమి తెలియును" అనుచుందురు అది సరికాదు. ఏలయన సంగీతమును విని యానందింపఁ దలఁచినవారు కూడ సంగీతమును నేర్చుకొని యుండవలయునా? రోగి వైద్యునియొద్ద కేగునపుడు తానుగూడ వైద్యము నేర్చుకొనియే పోవలయునా? అక్కఱలేదు రోగమునకుఁ దగిన మందు నొసంగి రోగికి సుఖమును గలిగించు విధి వైద్యునిది. ఈ వైద్యునివలనఁ దనకు సుఖమే కలిగినదో మఱింత శ్రమయే కలిగినదో రోగి సులభముగ గ్రహింపఁగలఁడు. సుఖదుఃఖానుభవజ్ఞానము సర్వజీవ సామాన్యధర్మము అట్లులే లౌకికవ్యాపారభారమున నలసినవారలు విశ్రాంతికొఱకు సంగీతము నపేక్షింతురు. అట్టివారు తాము సంగీతము నేర్చుకొని పాఠకునియొద్దకుఁ బోవలయునా? అది సరి కాదు. కావున వినువా రందఱును బాఠకులైనయెడల దాను సంతోష పఱచెద ననుట సద్ధర్మము కాదు. ఇట్లనుట హాస్యాస్పదంబుగఁ గూడ నుండును. మఱియు సుమారు రెండుగంటలు జరుగు సభలో నొకటి ముప్పాతిక గంటవఱకును పల్లవిపల్లవి యని సగ్గరి గగ్గరి మగ్గరి యనుచు గుండె లదరు నట్టులు గోలపెట్టి వినువారు చీదరపుట్టి లేచిపోవునట్లొనర్చి యాపై నొకటిరెండు ఏవో పాటలను బాడినను బాఠకునకు అర్థజ్ఞానమును ఉచ్చారణా సౌష్ఠవమును లేకపోవుటచేత మిగిలినవారలకును విసుగు పుట్టించు

టచే విద్వాంసులగువారు కూడ రక్తిగఁ బాడలేదనెడి యపఖ్యాతికి తానగుచున్నారు.

సంగీతము ఈ సగ్గరి గగ్గరి మగ్గరులతోడఁ గాలముఁ గడపుట కేర్పడినది కాదు. సంగీతమువలెనే సమర్థమైన రెండవవిద్య సాహిత్యము కలదు ఆ సాహిత్యమందు భక్తియో, జ్ఞానమో, వైరాగ్యమో, నీతియో, శృంగారమో, మఱి యెద్దియో కవిచేత నిముడ్పఁబడి యుండును. అట్టి భావమును సభాసదుల హృదయసీమలందుఁ జక్కఁగఁ బాదుకొనునట్లొనర్చుటకు అలంకారప్రాయమైన సాధనము ఈ సంగీతమైయున్నది. ఇందుకు దృష్టాంతము:—"రామ నీసమాన మెవరు? రఘువంశోద్ధారకా" అని యిట్టు లూరక పలికిన మాత్రంబున నెవ్వరికిని ఆనందము కల్గుట లేదు. ఈకృతినే సంగీతవిద్యానిధియగు త్యాగరాజుగా రేర్పరిచిన సంగీతవిద్యానియమంబులతోడ నేపాటకునిచేతనయినను బాడించి వినుఁడు. ఆ త్యాగరాజుగారు హృదయంబున భక్తిరసం బెంతగఁ బొంగి పొరలునపుడు దీని రచించిరో గాని దీనిని జెక్కఁగఁ బాడునపుడు ఆ ప్రిష్ఠోదుండు ప్రత్యక్షమై భక్తియోగం బుపదేశించుచుండెనో యనునట్లుండును. ఆ మాటల కింతటి ప్రకాశమెట్లు కలిగినది? అలంకారప్రాయమైన సంగీతము వానితోఁ జేరుటచేతనే; సాహిత్యభావమునకుఁ దగిన భావముగల సంగీతసంగతులు వానితోఁ జేరుటచేతనే. ఇట్లే తాను ఏభావములచేత సభ్యుల నానందపఱుపఁ దలచెనో ఆయా భావములకెల్ల ననుగుణంబులగు సంగీత సంగతులు చేరినప్పుడే రంజకంబుగ నుండును ఇదియే సంగీతవిద్యా లాభము ఇందుకొఱకే సంగీత మపేక్షింపఁబడఁదగియున్నది.

ఉ॥ గానము గానమన్న సరి । గగ్గరి గగ్గరి యంచు నూరకే।
ప్రాణము పోలుదాఁక బహు । భంగుల నూకుట కాదుకాదు, తాఁ
బూనినయట్టి భావము సు । బోధకమౌ గతి పొంపు గుల్కఁగా
వీనుల నాటఁజేయఁదగు । విద్యయె సుమ్మిది మిత్రరత్నమా!



## 2. సంగీతము ఎట్టులుండవలయును

సంగీతమును బోధించు శాస్త్రమునకు భరతశాస్త్ర మని పేరు. ఈ భరతశబ్దము ఏమి సూచించుచున్న దనఁగా శ్లో॥ భకారో భావసంయుక్తో - రేఫో రాగేణ సంశ్రితః । తకార స్తాళ ఇత్యాహుః - భరతార్థ విచక్షణాః॥ అనఁగా భకారము భావమును, రేఫము రాగమును, తకారము తాళమును, సూచించుచున్నవి ఈ భావరాగతాళములను గూర్చి బోధించుటచేతనే దీనికిభరతశాస్త్ర మని పేరువచ్చినది ఇట్టి శాస్త్రమును బోధించుటకై లక్ష్యలక్షణ సమన్వితంబులగు గ్రంథముల రచించిన దత్తిలకోహళాదులు ముప్పదియిద్దఱును భరతాచార్యులని పేర్వడసిరి

దీనింబట్టి చూడ వీనిలో మొదటిదియగు భావము ఈ శాస్త్రమునకు ప్రధానాంగమనియు, రాగము ఆ భావమునకు వన్నెఁదెచ్చుట కరుదెంచిన ద్వితీయాంగమనియు, తాళము ఈ భావరాగములకు ఆవర్తాదినియమములచేతఁ గాలపరిమాణ మేర్పఱుచుట కరుదెంచిన తృతీయాంగమనియు స్థిరపడుచున్నది వన్నెఁదెచ్చినను పరిమాణమేర్పఱచినను భావమునకే అయియున్నది. కావున భరతంబునకెల్ల భావము ప్రధానమై నిల్చుచున్నది ఇచట భావమనఁగా నేది యని శంక పొడమవచ్చును. భక్తియో జ్ఞానమో వైరాగ్యమో నీతియో శృంగారమో గీతమందు కవిచే నిముడ్పఁబడి యుండును. కావున నట్టి గీతాభిప్రాయమే భావమనఁబడును. అట్టి భావమును ప్రధానముగఁ జేసికొని దాని రసపోషణమునకై వలయువఱకు నిమిత్తమాత్రముగ రాగతాళముల నుపయోగించుకొనుచుఁ బాడిన పాటనే గాన మనఁదగును ఆ గానము పద్యగద్యంబులఁ బాడునపుడు భావరాగసహితమగుచును, కృతులను వర్ణములను బాడునపుడు భావరాగతాళసహితమగుచును ఉండును. ఈ భావమును మిక్కిలిగఁ ప్రకటించుటకు అభినయసహితమగు మార్గ మింకొకటి కలదు. కాని యది సంగీతవిద్వాంసుని పని కాదు. కాని యతఁ డుపదేశకుఁడు కావచ్చును. అందుచేత నతఁడు నటుఁ డనియుఁ బిలువఁబడును.

శ్లో॥ రాగ స్వరశ్చ తాళశ్చ త్రిభి స్సంగీత ముచ్యతే॥ అని కొందఱు చెప్పుచుందురు. రాగస్వరతాళములు మూఁడును జేరి సంగీతమయ్యె నఁట! అ దెట్లగును? రాగమును బాడి, స్వరమును బాడుచు, తాళమును వేయుచుఁ గూరుచుందురా? దీనిలో మాట లక్కఱయే లేదా? భావము లేని యిట్టి సంగీత మెచ్చటనైన నుండునా? స్వరము సంగీతాభ్యాసమున కొక సాధన మగును గాని సంగీతమున కొక యంగ మగునా? కావున నిది సరికాదు.

ఇట్టి సంగీతమును కొందఱు గాత్రమూలముననూ మఱికొందఱు ఫిడిలు వీణ మొదలగు జంత్రవాద్యముల మూలముననూ బాడి సభాసదుల నానందపఱుచుచుందురు. ఎవ రెట్లు పాడినను వీనిలో నల్ల గాత్రపుపాట ప్రధానమైనదనియు, కొదున జంత్రమూలము లగుపాటలన్నియు గాత్రపు పాటకు సాయ మొనరించుటకుమాత్ర మరువెంచినవనియుఁ జెప్పఁదగి యున్నది. ఏలయన భావసహితమగు పాట గాత్రమూలముననే సాధ్యమగును గాని జంత్రవాద్యమూలమున సాధ్యము కాదు. అట్లగునచోఁ గొందఱు గాత్రమునఁ బాడుట రాకయూరకుండియు మఱికొందఱు పాడఁగలిగినను గొంచెముమాత్రము గాత్రమున గొణఁగియూరకుండియు పాటసంతము జంత్రమూలముననే వినిపించుచుందురే ఇది కూడదా యని కొందఱు శంకింపవచ్చును. కూడకేమి? కూడును. గానము చక్కెరపానకము వంటిది. ఈ పానకమును గోదుమపిండి, సెనగపిండి, మినుపపిండి, అనుపపిండి, మొదలగువానితోఁ జేర్చి భక్ష్యరూపము గావించుకొని భుజించిన యెడ దానిచే దేహమునకు రక్తపుష్టియు, ఉత్సాహమును, బలమును గలుగును. ఆ పిండికి రుచిగలిగించుటయే ఈ పానకము యొక్క యుపయోగము. ఏ పిండియు నక్కఱలేకయే వట్టిపానకమును మాత్రమే త్రాగెదమనినచోఁ జేదుగనుండునా? ఉండదు. తీయఁగనే యుండును. కాని శరీరమునకు దానివలన రక్తపుష్ట్యాద్యుపయోగములు కలుగనేరవు. ఈ యుపయోగములు లేనిచో ఆ పానకమువలన ప్రయోజనమేమి? నోరు తీయనయగుట మాత్రమేనా? దమ్మిడిపెట్టి బెల్లముకొని నోటిలో

వేసికొనినయెడ నోరెంతయుఁ దీయఁబడును. అట్టు లెవ్వరయిన నాసింతురా?
ఆ తియ్యదనము క్షణభంగురము గనుక సరసు లెన్నఁడును అట్టు లాసిం
పరు ఇదేవిధముగ గోదుమపిండి సెనగపిండి మినపపిండి వంటి భక్తిజ్ఞాన
వైరాగ్యములకుఁ గాని ఇట్టి మఱియొక దానికిఁ గాని రుచిని గలిగించి
వానిని శ్రోతల కనుభవయోగ్యము లగునట్లును ప్రీతికరములగునట్లును
ఒనర్చుటే యీ గానవిద్యయొక్క యుపయోగము అట్టి భావములను
విసర్జించి వట్టి గానమునుమాత్రమే జంత్రమూలమున వినఁగోరినయెడ
నెట్టులుండును? వినుచున్నపుడు మాత్రము చెవుల కింపుగనే యుండును.
కాని భక్తిజ్ఞాన వైరాగ్యములను హృదయములందు నెలకొల్పఁదగు భావ
మిందు లేదు కనుక నోటిలోవేసికొనఁబడిన వట్టిబెల్లపుముక్క యెంతప్ర
యోజనకారియగునో ఇదియు నంతే ప్రయోజనకారి యగును. కావున
సరసు లెప్పుడును భావసహితగానమునే కోరుచుందురు అట్టి గానము
గాత్రమూలముననే సాధ్యమగును. కాని అన్యవిధములచేతఁ గానేరదు.
అట్టి గానమును కేవలము ఫిడేలుమీఁదనే వీణమీఁదనే వినెదమనినచో
బెల్లపుముక్కచేత నోరు తీయఁబడునట్లు ఈ గానముచేతఁ జెవి తీయఁ
బడును గానవిద్య యిట్టి ప్రయోజనమునకై యేర్పడిన విద్య కాదు లోక
మందుఁ గొన్నిస్థలములలో లడ్డూలు పూరీలు అతిరసాలు మొదలగునవి
దొరకనపుడు వట్టి బెల్లపుముక్కను మాత్రమే చవిగొని యానందించు
వారలు మాత్రము లేరా? కేవలజంత్రవాద్యముల నాసించువారలును
అట్టివారలే యగుదురు.

మఱియు గాత్రపుపాటయందును భావరహితమైన కొంతభాగము
ఆచారవశంబున ననాదిగఁ జేరియున్నది. అదెద్దియన, అఅఅఅ, ఇఇఇఇ,
ఉఉఉఉ, అనంతానంతానంతా, నననయనుచు వట్టిరాగమును బాడుట,
సగ్గరిగగ్గరినుగ్గరియనుచు స్వరకల్పనఁ జేయుట, తక్కిటదిక్కిట ఝెంతక
మను జతులనుగొల్పుట అయియున్నది. ఈ రాగమునకుఁగాని స్వరము
నకుఁగాని జతులకుఁగాని అర్థ మెంతమాత్రమును లేదు. కావున భావమును
లేదు. భావసహితమైన గానమునకుఁ గొంచెము రుచిభేదమును గలిగించు

టకు ఈ మూఁడును గానమునకుఁ జేర్పఁబడినవి కాని భావసహితమైన గానమునకు ముఖ్యముగ వలయు కంఠమాధుర్యము, అర్థజ్ఞానము, భావప్రకటనసామర్థ్యము, విద్యలన్నియు లోకోపయోగార్థమే కాని స్వప్రయోజకత్వ ప్రకటనార్థము కావనెడి యనుభవమును, లేని కొందఱు పాటకులు, అట్టి గానముచేత సభ్యుల నానందపఱుపఁజాలక, యీ యెడ తెగని రాగాలాపముచేతను, స్వరకల్పనచేతను, జతులుకొల్పుటచేతను సభలయందు పదియేనువీసముల కాలమును గడపి తాము విద్వాంసుల మనిపించుకొనఁ జూచుచుందురు ఈ రాగస్వరజతులు మూఁడును నర్థవిహీనములగుటచేత వీనియందుఁ బొరకులు కనఁబఱచెడి పాండిత్యము పెక్కండ్రకు సహజమైన సంతోషమును గలిగింపదు ఈ విద్వాంసు లా సంతోషింపనివారిని గాంచి "ఇది శాస్త్రీయమైన గానము, దీని మీరు గ్రహింపఁజాలరు" అని వారల నిరసించుచుందురు పాపము ! వారది నిజముగాఁ దమ యసమర్థత యనుకొని సంగీతసభలకుఁ దఱచుగాఁ బోవుట మాని ప్రస్తావము కలిగినప్పుడు "మాకు సంగీతము తెలియదు, మేము ఆ సభలకు వచ్చి ప్రయోజనమేమి" అని యనుచుందురు ఇది పండితమ్మన్యులగు నట్టి కొందఱు విద్వాంసులు దేశమునకొనర్చిన యపకారము కాని వినువారల యసమర్థత కాదు లేనియెడల ఆపాతమధురమగుచు సర్వజనానందకరమగు సంగీతమున కానందింపలేము అనువార లుందురా? కూరలును పచ్చడులును అన్నమునకు రుచికలిగించునట్టులు మితముగాఁ బ్రయోగింపఁబడినయెడ రాగాలాపమును స్వరములును జతులును. భావరహితములయినను, నిజమయిన గానమునకు రుచులు కల్పించునను టకు సందియము లేదు. కాని యన్నమును తగ్గించి కూరలను పచ్చడులను మాత్రము తినఁజూచినయెడ ధాతృనామసంవత్సరపు కఱవులో తాటికాయలను గుమ్మడికాయలను దిని కడుపునింపుకొనిన ట్లుండును. ఇట్టి దానినే 'అసల్ పిసల్ గయా, హల్కా చప్గయా' అని యందురు.

కావున గాన మెప్పుడును భావప్రధానమై, ప్రత్యేక రాగాలాపములను స్వరములను జతులను రుచికల్పనార్థముగను జంత్రవాద్యము

లను గాత్రపుపాటకు సహాయార్థముగను మాత్రము కలిగి, సుబోధమై యుండవలయును.

గీ॥ చవులఁ గల్పింప స్వరరాగ ♦ జతులు దనర।
జంత్రవాద్యంబులును గూడ ♦ సాయపడఁగ।
భావమొకటి ప్రధానమై ♦ ప్రబలుచుండ।
గాన మెపుడు సుబోధమై ♦ గ్రాల వలయు॥

3 స్వరము సంగీతమునకుఁ గాక యంగ మగునా ?

ఇట్లనుటచే స్వర మక్కఱలేదని కాదు కాని స్వర మెంతవఱకవసరము అను దానిని సిద్ధాంతీకరించుటయే దీని యభిప్రాయము. దీనికి శాస్త్రప్రమాణము లనవసరములనియుఁ జిరకాలాగతమైన శిష్టాచారము చేతనే దీనిని సిద్ధాంతపఱుపఁదగుననియుఁ గన్పట్టుచున్నది

సంగీతవిద్యార్థికిఁ బ్రారంభమందు స్వరములే నేర్పఁబడుచున్నవి. స్వరములనఁగా సరళిస్వరములు, దాఁటుస్వరములు, హెచ్చుస్థాయిస్వరములు, జంటస్వరములు మొదలగునవి పిమ్మట సప్తతాళముల యలంకారములు నేర్పఁబడుచున్నవి ఈ స్వరములకుఁగాని అలంకారములకుఁగాని సాహిత్యములు చేర్పఁబడుట లేదు ఇంతవఱకు స్వరములతోడి కసరతు విద్యార్థికి బాగుగ నలవాటుపడి ఆ స్వరస్థానము లాతని హృదయమునఁ జక్కఁగ నాటుకొనిన వెనుక గీతములు నేర్పఁబడుచున్నవి గీతము అనఁగా పాడఁబడినది అని యర్థము. విద్యార్థికి ఇచటనే పాట ప్రారంభమగును. ఇంతవఱ కతనికి నేర్పిన దంతయు నిల్లు కట్టుకొనఁదలచిన వాని కవసరమగు రాళ్లు సున్నము దూలములు సమకూర్చి యొసఁగినట్లులు, సంగీత విద్యార్థి కవసరమగు స్వరస్థానపరిచయము సప్తతాళావృత్తపరిజ్ఞానము మును నొసఁగఁబడినవి ఇఁక గీతములు అనుటతోనే వీనికి సాహిత్యములు చేర్పఁబడినవి. ఈ గీతములు వివిధరాగములందు నేర్పఁబడుచున్నవి. వీని సాహిత్యములందు లేశమాత్రము తానములు ను జేర్పఁబడినవి. తానము లనఁగా శబ్దాక్షరముల నడుమ నచ్చటచ్చటఁ జేర్పఁబడిన అకార

ఇకార ఉకార ఎకార ఒకారముల సముదాయములు. రామయ్య అను టకు రఅఅఅ మఇఇఇ య్యఅఅఅ అని యందురు ఈ తానంబులు కృతులఁ బాడుటకును, రాగము నాలాపించుటకును ముఖ్యాధారములగుటచే నట్టి తానాభ్యాసంబునకై తానమే ప్రధానముగాఁ గల వర్ణములు తాన వర్ణములను పేరుతోఁ వ్రాయఁబడినవి వర్ణములనఁగా నక్షరములు. తాన వర్ణములనఁగా తానముతోఁ గూడిన యక్షరములు అని యన్వయింపఁ దగి యున్నది విద్యార్థికి గీతముల యనంతరమందు ఈ తానవర్ణములే నేర్పఁ బడుచున్నవి ఇందు స్వరసాహిత్యముచేఁ దానముల నలవఱచుకొని యా స్వరమును విడిచివేసి తానమును మాత్రమే విద్వాంసులు పాడుకొందురు. ఈ ప్రతితానవర్ణముయొక్క చివరను ఒక పల్లవియుఁ గొన్ని చిట్టస్వర ములును వ్రాయఁబడుచున్నవి ఇవి విద్యార్థికి ముందుముందు స్వయ ముగ స్వరకల్పనఁ జేయుటకు వలయు మార్గముల బోధించును. ఈ వర్ణ ముల యనంతరమందుఁ గృతులు నేర్పఁబడుచున్నవి. ఇవి కేవలముగ శబ్ద ప్రధానమైనవి ఇందు స్వరసంబంధము పూర్తిగ నవలివేయఁబడినది. అచ్చటచ్చటఁ గొన్నికొన్ని కృతులకుఁ జివర నొకటిరెం డావర్తములు స్వరము వ్రాయఁబడినను దానికి సాధారణముగఁ దానరహితమగు సాహి త్యము ను వ్రాయఁబడుచునే యున్నది.

ఇది యంతయు శిష్టాచారము ఈ శిష్టాచారము గ్రంథస్థమై యే కన్పట్టుచున్నది దీనింబట్టి స్వరము సంగీతమున కొక యంగమగునా యను నంశము సిద్ధాంతీకరింపఁబడవలసి యున్నది ఎట్లనఁగా:—

దహరాకాశ విహారమాణమగు పరబ్రహ్మంబునందు నాదమొ క్కటి యుద్భవించినది. అది కేవల ధ్వన్యాత్మకమై యుండునపు డీశ్వర సంకల్పవశంబున నలంకారప్రాయంబులగు కొన్ని భేదంబుల నంది యవ్యక్త మధుర మగుచు గాత్రములందును వీణ వేణు షహారి మొదలగు జంత్రము లందును మిగులఁ బ్రకాశించినది. ఈ నాదమునకుఁ గలిగిన యవ్యక్త మధురిమ యంతయు దానియందలి ధ్వనిభేదంబులవలననే కలిగినది. ఆ ధ్వనిభేదంబులకే యనంతరమందు శ్రుతులని పేరుపెట్టఁబడినది. ఈ వివిధ

శ్రుతుల నెఱింగెడి జ్ఞానంబునకే శ్రుతిజ్ఞాన మని పేరు. ఎవరుగాని నాద బ్రహ్మానందమును స్వేచ్ఛగ ననుభవింపఁ గోరినయెడల నందుల కీ శ్రుతిజ్ఞానసంపాదనము ప్రథమకర్తవ్య మగుచున్నది.

ఈ శ్రుతుల నితరులకు బోధించుటకును వీనిని లోకోపకారార్థముగ గ్రంథస్థము చేయుటకును ననంతరమందుఁ బేళ్లవసరమై కన్పట్టినవి, అనఁగా శబ్దప్రయోగజ్ఞానమును లోకమునకుఁ గలిగించుటకు వ్యాకరణశాస్త్రమును వ్రాయదలచినపుడు కొన్నికొన్ని విధముల శబ్దములను జేర్చి యొక్కొక్కతరగతిగా నేర్పఱచి యాతరగతులకు నామవాచకములనియు, క్రియలనియు మొదలుగాఁగల సంజ్ఞలు అనఁగాఁ బేళ్లు పెట్టి వానింగూర్చి బోధించుటకుఁ బ్రప్రథమమందు సంజ్ఞాప్రకరణము వ్రాసినట్లులు ఈ సంగీతశాస్త్రంబునకును శ్రుతిబోధనార్థము సంజ్ఞాప్రకరణం బవసరమైనది. అందుచేఁ గొన్నికొన్ని శ్రుతుల నొకటిగఁజేర్చి వానికి 'స' అనియు మఱి కొన్నిటికి 'రి' అనియు నిట్లు స రి గ మ ప ధ ని అని యేడుపేర్లు పెట్టి వీనికి స్వరములని సముదాయనామము పెట్టఁబడినది ఈ యేకాక్షర నామంబులకుఁ బ్రసంగానుకూలంబులుగ నుండుటకు షడ్జము ఋషభము గాంధారము మధ్యమము పంచమము ధైవతము నిషాదము నని వరుసగ్గా నేడు సంకేతనామంబులు పెట్టఁబడినవి ఈ స్వరములలో నొక్కొక్కటి రెండుమూఁడు శ్రుతులకుఁ బ్రతినిధిగ నుండినను, ఒక్కరాగంబును బాడునపుడు అది యొక్కశ్రుతినే యనుసరించియుండుట శాస్త్రసమ్మతము ఆయాస్వరముల నుచ్చరించునపుడు అవి యేశ్రుతులకు నామములై యుండునో ఆయా శ్రుతులు తప్పక ధ్వనించుచుండవలయు. అట్లు ధ్వనించునట్లు స్వరములను స్వేచ్ఛగాఁ బ్రయోగించుటయే స్వరకల్పనఁ జేయుట యనఁబడుచున్నది. ఇది యంతయు స్వరజన్మపూర్వవృత్తాంతము.

సంగీతవిద్యార్థికి ఈ స్వర మెంతవఱ కవసరమో యిపుడు విచారపఱచియున్నది దీనికి విశేషయోజన యక్కఱ లేదు. ఈఁత యలసడు తవఱకుఁ జెప్ప నెంత ప్రయోజనకారియో పైఁజెప్పఁబడిన శ్రుతులను స్వేచ్ఛగా సాహిత్యమునకుఁ జేర్చి రంజిల్లఁజేయుటకు వలయు శ్రుతి

జ్ఞాన మలవడువఱకును ఈ ప్రతినిధిరూపమగు స్వర మంత ప్రయోజనకారి. ఈంత యలవడిన వెనుక తెప్ప యెంత యనవసరమో శ్రుతిజ్ఞాన మలవడిన వెనుక స్వర మంత యనవసరము. ఇందులకు లక్ష్యము:— సంగీతవిద్యార్థికిఁ బ్రారంభమందు సప్తతాళాలంకారములుపూర్తియగువఱకును కేవల స్వరములే నేర్పఁబడుచున్నవి ఇందువలన విద్యార్థికి స్వరప్రతినిధిసాహాయ్యముచే శ్రుతిజ్ఞాన మలవడుచున్నది అంతట గీతములు ప్రారంభింపఁగనే ముందు పిళ్లారిగీతములు నేర్పఁబడుచున్నవి పిళ్లారి అనగా విఘ్నేశ్వరుఁడు. ఆయనను ప్రార్థనచేయుటకు ఈ గీతము లేర్పడినవి అట్లయినచో పిళ్లారిస్వరములును పిళ్లారివర్ణములును పిళ్లారికృతులును గూడ నెందుకు వ్రాయఁబడలేదని కొందఱికి శంక పొడమవచ్చును గాని యా ప్రకార మవశ్యకము లేదు ఏలయన, నెవరుగానివిఘ్ననివారణార్థముగఁగార్యారంభమందు విఘ్నేశ్వరుఁ బ్రార్థింతురు సంగీతవిద్యార్థి నిజమైన సంగీతమును, అనఁగా భావసహితమైన పాటను, గీతములయొద్దనే ప్రారంభించుచున్నాఁడు కావున నచట విఘ్నేశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడు వీనికిఁ బూర్వమందు నేర్పఁబడిన కేవలస్వరములు భావరహితములు గనుక వానిపాఠము గానాభ్యాసము కానేరదు కావున నచ్చట విఘ్నేశ్వరస్తవము చెప్పఁబడలేదు తానవర్ణములును కృతులును గానమధ్యభాగములు కావున వానియందును విఘ్నేశ్వరస్తవము ప్రత్యేకముగఁ జెప్పఁబడలేదు ఇందువలన గీతములే సంగీతమునకు మొదటిభాగ మని తెలిసికొనవలసి యున్నది. ఇచటనే భావసహితమగు సంగీతము ప్రారంభింపఁబడుచున్నది అట్టి గీతములను బ్రారంభింపఁగనే విద్యార్థి తా నదివఱకు సంపాదించిన శ్రుతిజ్ఞానమును స్వరప్రతినిధిసాహాయ్యంబున సాహిత్యముపైఁ బ్రయోగించుటకు నేర్పఁబడుచున్నాఁడు. ఇప్పుడు స్వరములును సాహిత్యములును ఒకటి వెనుక నొకటి క్రమంబుగఁ బాడఁబడుచున్నవి. అంతటఁ దానవర్ణంబులను బ్రారంభింపఁగనే యావర్ణము లీ స్వరప్రతినిధిసాహాయ్యంబునసె నేర్పఁబడుచున్నవి గాని పాడునపు డందలి స్వరమును విడిచి సాహిత్యమునుమాత్రమే పాడుకొందురు. అనంతరము కృతులు నేర్పఁబడినపుడు వానియందలి సంగతులన్నియు

స్వరసాహాయ్యంబుననే నేర్పఁబడుచున్నవి గాని కృతులఁబాడునపుడు ఆ స్వరముల నెవ్వరును బాడరు. ఆ స్వరములిచటఁ బూర్తిగ వదలివేయఁబడు చున్నవి. ఇట్లు కేవలస్వరములతో మొదలిడఁబడిన సంగీతసాధకము కేవల సాహిత్యములతో ముగియుచున్నది. ఇందువలన నేమి తెలియుచున్నది! సంగీతవిద్యకుఁబ్రధానమైన భావమును బోధించెడి సాహిత్యములపైన సంగీతశ్రుతిభేదములను స్వేచ్ఛగఁబ్రయోగించు జ్ఞానము అలవడువఱకును ఆ శ్రుతిభేదములకుఁ బ్రతినిధియైన స్వరము, ఈఁత నేర్చుటకుఁ దెప్పయు విద్య నేర్చుటకు బుస్తకమును జేకొనఁబడినట్టులు, సాధనప్రాయముగ మాత్రము చేకొనఁబడెననియుఁ, బనిముట్లతో నాభరణములఁ జేసి ధరించుకొని యా పనిముట్లను మూలదాఁచుకొనినట్లు సాధనప్రాయమైన యీ స్వరము అనంతరమందు దాఁచిపెట్టఁబడుచుండెననియుఁ దెలియుచున్నది. ఇట్లు సంగీతముయొక్క యాద్యంతదశలయందు లేనట్టియు, నడుమవచ్చి సాధన ప్రాయముగ మాత్రము ప్రకాశించినట్టియు నీ స్వరమును, శ్లో॥ రాగ స్వరశ్చ తాళశ్చ - త్రిభి స్సంగీతముచ్యతే ॥ అనెడి యొకానొక శ్లోకము చొప్పున, సంగీతమున కొక యంగమని చెప్పుట తగదు.

అయినను చేతికఱ్ఱయు గులిమితెడ్డును, కత్తి బాకు మొదలగు కొన్ని యాయుధంబులును, కేవలసాధనములే యయినను అలంకారభూషణములుగఁ గూడఁ గొందఱిచే వాడఁబడినట్టులు, ఈ కేవలసాధనమైన స్వరమును సంగీతమున కొక యలంకారముగఁగూడ వాడఁబడుట యాచారమందుఁ గనవచ్చుచున్నది అట్లయినను అలంకారమలంకారమే యగుఁ గాని యంగము కానేరదు కావున

స్వరము సంగీతమున కొక యంగముకాదు.

చ॥ ఘనమగు గానశాస్త్రము న ♦ ఖండగతిం బఠియింప నొక్కసా
ధనమయినంతనే స్వరము ♦ దానికి నంగమనంగఁ జెల్లునే?
తనువున స్వర్ణభూషలను ♦ దాల్తురుగాని బళీ! కళాదు సా
ధనములఁగూడఁ దెచ్చి తలఁ ♦ దాలిచి యేరును గుల్కుటొప్పునే?

———•———

రాగములలో నెనిమిది పురుషరాగములనియు, మఱి యిరువది నాలుగు స్త్రీరాగములనియు, వానిలో నొక్కొక్క పురుషరాగమునకు మూఁడేసి స్త్రీరాగములు భార్యలనియు, నొక ఋషి చెప్పియున్నాఁడు. అవి యిట వివరింపఁబడుచున్నవి.

| పురుషరాగములు. | వానిభార్యలగు స్త్రీరాగములు. |
|---|---|
| 1. భైరవి. | దేశక్రియ, మేఘరంజి, గురంజ |
| 2. భూపాళము. | బిలహరి, మలహరి, ధాంసి. |
| 3. శ్రీరాగము | ఆందోళి, భల్లాతి, సాహుళి. |
| 4 ఫలమంజరి | దేశి, ముఖారి, లలిత |
| 5. వసంతము. | రామక్రియ, వరాళి, గౌళి |
| 6. మాళవి. | గుండక్రియ, ఘూర్జరి, పాళి |
| 7. బంగాళము. | కల్యాణి, ఆహిరి, సావేరి |
| 8. నాట. | ఘంటారవము, కాంభోజి, శంకరాభరణము |

ఈ యెనిమిది పురుషరాగములును, ఇరువదినాలుగు స్త్రీరాగములును జేర్చి రాగములు ముప్పదిరెండయ్యెను

వీనిలోఁ గొన్నిటిని పురుషరాగములనుటకుఁ గాని మఱికొన్నిటిని స్త్రీరాగములనుటకుఁ గాని కారణముల నెంతమాత్రమును వచించి యుండలేదు అది యెట్లున్నను, రాగములన్నియు నీ ముప్పదిరెండు మాత్రమే యనుకొనుట మాత్రము గొప్ప పొరపాటు కావున రాగము లెన్నియైనదియు నిట వివరింపఁబడును.

ఈశ్వరసంకల్పవశంబున నాదమునందుఁ గొన్ని భేదంబులు కలిగి గొననియు, ఆభేదంబులే యనంతరమందు శ్రుతులని పిలువఁబడెననియు, అట్టి రెండుమూఁడు శ్రుతులకు ఒక్కొక్క స్వరము ప్రతినిధియై నిలుచు ననియు, వెనుకటి యుపన్యాసమునఁ దెలుపఁబడెఁగదా ఈ సందర్భమునకు

శ్లో॥ చతుశ్చతుశ్చతుశ్చైవ- షడ్జమధ్యమపంచమాః ।
ద్వేద్వే నిషాదగాంధారౌ - త్రిత్రీ ఋషభధైవతే ॥

షడ్జమధ్యమ పంచమములకు, అనఁగా స, మ, ప, అను స్వరములలో నొక్కొక్కదానికి నాలుగేసియనియు, నిషాదగాంధారముల కనఁగా ని, గ, అను స్వరములకు రెండేసియనియు ఋషభధైవతముల కనఁగా రి, ధ, అను స్వరములకు మూఁడేసియనియు నిట్లు మొత్తమునకు ఇరువదిరెండు శ్రుతులని యొక్కచోఁ జెప్పఁబడియున్నది. కాని యీ భేదములచేత రాగము లేర్పడలేదు. రాగము లేర్పడిన భేదములు వేఱుగ నున్నవి. అవి యెట్లనఁగా ఋషభ గాంధార ధైవత నిషాదములకు మూఁడేసియు మధ్యమమునకు రెండును షడ్జపంచమములకు ఒక్కొక్కటియు మొత్తమునకుఁ బదియాఱు శ్రుతిభేదంబులు చెప్పఁబడినవి ఇందు షడ్జ పంచమములకు శ్రుతిభేదములు లేవు గాన వాని నట్లులనే యుంచి తక్కిన రిగమధని యను నైదుస్వరములకుఁ గల పదునాలుగు శ్రుతులను ప్రస్తరింపఁగా 72 రాగములు జనించినవి (ప్రస్తరించుట యనఁగాఁ గలుగఁదగినన్ని భేదములఁ గలిగించుట ఉదాహరణముగ 'సరిగ' యను మూఁడక్షరములఁ ప్రస్తరించినచో "సరిగ, రిసగ, సగరి, గసరి, రిగస, గరిస" అని యిట్లు ఆఱు భేదంబులు కలుగును ఇట్టులే తాళములుగాని ఛందస్సునందలి గణములుగాని మఱి యేవిగాని ప్రస్తరింపఁబడును ఇట్టిదానినే ప్రస్తారము (permutations) అందురు. ఇదేవిధముగా 'రిగమధని' అను నైదుస్వరములకుఁ గల పదునాలుగు శ్రుతులను ప్రస్తరింపఁబడి డెబ్బదిరెండు రాగములైనవి. ఎట్లనఁగా:—నిషాదముయొక్క మూఁడు శ్రుతులచేత మూఁడు భేదములును, ధైవతముయొక్క మూఁడు శ్రుతులచేత మూఁడు భేదములును మొత్తము ఆఱుభేదములైనవి. ఈ యాఱుభేదములను ఋషభగాంధారముల మొత్తము శ్రుతు లాఱింటచే హెచ్చింపఁగా (6×6=36) ముప్పదియాఱు భేదములైనవి. ఈ ముప్పదియాఱుభేదములను మధ్యమముయొక్క రెండు శ్రుతులచే హెచ్చింపఁగా (36×2=72) డెబ్బదిరెండు భేదము లేర్పడినవి ఇవి ముందు ప్రస్తారక్రమంబున నింకను విశదంబుగఁ జెప్పఁబడును. ఈ డెబ్బదిరెండును మేళకర్తరాగము లనియు, జనకరాగములనియుఁ బిలువఁబడుచున్నవి ప్రస్తుతమందు వాడుకలోనుండిన

సంగీతశాస్త్రమున కెల్ల మూలాధారములై యుండిన యీ డెబ్బదిరెండు రాగములే. ఈ మేళకర్తలు సప్తస్వరములను ప్రస్తరించుటచేతఁ గలుగలేదు. వానిలో నైదు స్వరములయొక్క శ్రుతిభేదములను ప్రస్తరించుటచేఁ గలిగినవి. వీనిలో నొక్కదానియందైన నొక్కస్వరమైన లోపించుట యుండదు. కావున నివి సంపూర్ణరాగములనియుఁ బిలువఁబడుచున్నవి. వీని నామములను మేళకర్తల నామవివరణమందుఁ జూడనగును.

ఈ డెబ్బదిరెండు రాగములను జనకరాగములనియు, సంపూర్ణరాగములనియుఁ జెప్పుటచే జన్యరాగములును, అసంపూర్ణరాగములును, వేఱుగఁ గలవా యని యెవరికిఁగాని శంక వొడముక మానదు. అట్టి రాగములును గలవు అవి యీ డెబ్బదిరెండురాగములను, వానిలో నొక్కొక్కదానియందలి ఒకటి లేక రెండు స్వరములను వర్జించుచుఁ, ప్రస్తరింపఁగాఁ గలిగినవి. అది యెట్లనఁగా:—సప్తస్వరములలో నొక్కదాని విడిచి మిగిలిన యాఱుస్వరములతోఁ గాని, రెంటిని విడిచి మిగిలిన నైదు స్వరములతోఁ గాని రాగములను పాడవచ్చును. కాని మూఁడు స్వరములను విడిచి మిగిలిన నాలుగుస్వరములతో రాగమును పాడఁగూడదు. ఈ సప్తస్వరములలో షడ్జము తక్కినవాని కన్నిటికిని మూలాధారమును, మఱియు స్వరారంభకారణమైన ధ్వనివిశేషంబును నగుటచేత దానిని మాత్రము వర్జింపఁ గూడదు. తక్కిన 'నిధపమగరి' అను స్వరములను క్రమముగా నొక్కొక్కటి చొప్పున వర్జింపఁగా నాఱు భేదంబు లేర్పడుచున్నవి. పిమ్మట రెండేసి యక్షరముల వర్జింపఁగా "1 నిధ, 2 నిప, 3 ధప, 4 నిమ, 5 ధమ, 6 పమ, 7 నిగ, 8 ధగ, 9 పగ, 10 మగ, 11 నిరి, 12 ధరి, 13 పరి, 14 మరి, 15 గరి" అని యిట్లు పదునైదు భేదము లేర్పడుచున్నవి. మొట్టమొదట సంపూర్ణముగ నుండిన భేద మొకటి కలదు. ఇప్పుడు మొత్తమునకు (1+6+15=22) ఇరువదిరెండు భేదము లేర్పడుచున్నవి.

ఇచట మఱియొక్క విషయము నెఱుఁగవలసియున్నది. రాగమునకు ఆరోహణము అవరోహణము నని రెండు కలవు. ఆరోహణమనఁగా నెక్కుట.

అవరోహమనఁగా దిగుట.'సరిగమపధనిస' ఇది స్వరముయొక్క యారోహ మనఁబడును. 'సనిధపమగరిస' ఇది యవరోహ మనఁబడును. ఈ రెండును జేరినఁ గాని రాగము కానేరదు ఈ రెంటియందలి స్వరసంఖ్య సమంబుగ నుండుటయు నుండకపోవుటయుఁ గలదు. అనఁగా నొకదానియందు 5 మఱియొకదానియందు 6, 7 గాని లేక రెంటియందును 5 లేక 6, 7 గాని స్వరములుండును.ఆఱుస్వరములుగల రాగములకు షాడవరాగములనియు, నైదుస్వరములుగల రాగములకు ఔడవరాగములనియు, నేడుస్వరములు గలవానికి సంపూర్ణములనియుఁ బేళ్ళు కలవు. ఆరోహణమందు సంపూర్ణముగనుండి, అవరోహణమందు ఆఱుస్వరములే యుండినచోఁ దానికి సంపూర్ణషాడవరాగ మని పేరు ఇట్టులే రాగములలో 1 సంపూర్ణ సంపూర్ణములు, 2 సంపూర్ణషాడవములు, 3 సంపూర్ణఔడవములు, 4 షాడవ సంపూర్ణములు 5 షాడవ షాడవములు, 6 షాడవ ఔడవములు, 7 ఔడవ సంపూర్ణములు, 8 ఔడవ షాడవములు, 9 ఔడవ ఔడవములు నని తొమ్మిది భేదములు కలవు. వీనిలో 1, 5, 9 భేదములను సాధారణంబుగ సంపూర్ణములు, షాడవములు, ఔడవములు నని మాత్రమే వాడుదురు.

పైఁజెప్పఁబడిన 'నిధపమగరి' యను స్వరములఁ బ్రస్తరించుట చేఁ గలిగిన సంపూర్ణషాడవౌడవభేదంబులు (1+6+15=22) ఇరువదిరెంటిలో నొక్కదానిని ఆరోహణమందు నిలిపి అవరోహణమం దీ యిరువది రెండుభేదంబులఁ జేర్చినచో నిరువదిరెండు రాగము లేర్పడును. ఇట్టులే పై యిరువదిరెండు భేదములలో నొక్కొక్కదానిని ఆరోహణమందుఁ బెట్టుచు నవరోహణమందుఁ బ్రతిదానికిఁ బై యట్టులు ఇరువదిరెండు భేదముల నంటించుచుఁ బోయినచోఁ దుదకు ఒక్క మేళకర్తయందు (22×22=484) నాలుగువందల యెనుబదినాలుగు రాగంబు లేర్పడును. ట్టులే డెబ్బదిరెండు మేళకర్తలయందును (484×72=34848) ముప్పది లుగు వేల యెనిమిది వందల నలుబదియెనిమిది రాగములు కలుగును. ఎలో మొదటి 72 మాత్రము జనకరాగములనియుఁ దక్కినవి న్యరాగము లనియుఁ బిలువఁబడును.

ఇవన్నియుఁ గాక పులిమీఁదఁ బుట్రవలె మఱియొకటి కలదు. అది వక్రరాగముల విషయము. (ఉదా. సరిమపనిస - సనిపమరిగరిస). ఇట్టి వక్రరాగము లిన్ని కలుగునని నిర్ణయించుటకు మార్గము లేదు. లెక్కలేనన్ని జనింపఁగలవు.

కావున రాగములు 32 మాత్రమే యనుకొనుట పొరపాటు. చక్కఁగ విచారించినచో 'అనంతావై రాగాః' అను వాక్యము సార్థకమగుచున్నది.

గీ. షాడ వౌడవ సంపూర్ణ • సరణి చేత
గణన సేయఁగ వేలు రా • గంబు లగును
వక్రమార్గంబులను గూడఁ • బ్రస్తరింప
నంతు తెలియక సంఖ్య య • నంత మగును.

---

## 5. రాగమును బాడు టెట్లు?

రాగమును బాడఁగోరువారు ప్రప్రథమమున ముఖ్యముగ నైదు విషయంబులను గమనింపవలయును అవి యెవ్వియనఁగా:—1 ఈ రాగము ఆరోహణావరోహణములయందు సంపూర్ణషాడవౌడవములలో నేభేదముల నందుచున్నది? 2 షాడవౌడవములలోఁ జేరినయెడ నం దేస్వరములు వర్జింపఁబడినవి? 3 జనకరాగమైనయెడ నిది యెన్నవ మేళకర్త? 4 జన్యరాగమైనయెడ నెన్నవ మేళకర్తయందు జనించెను? 5 వక్రమైనయెడ నిం దేస్వరములు ఎట్టులు వక్రించెను? వీని నెఱుఁగు విధము లిచట వివరింపఁబడును.

| | రాగము. | ఆరోహణము. | అవరోహణము. | తరగతి. |
|---|---|---|---|---|
| 1. | చక్రవాకము | సరిగమపధనిస | సనిధపమగరిస | సంపూర్ణము. |
| 2. | మలయమారుతము | సరిగపధనిస | సనిధపగరిస | షాడవషాడవము. |
| 3. | సావేరి | సరిమపధస | సనిధపమగరిస | ఔడవసంపూర్ణము. |
| 4. | ఛాయాసింధు | సరిమపధస | సధపమగరిస | ఔడవషాడవము. |
| 5. | హిందోళము | సమగమధనిస | సనిధమగస | వక్రఔడవము. |
| 6. | శుద్ధమాళవి | సగమపధస | సధపమరిగరిస | ఔడవవక్రషాడవము. |

మొదటి విషయము నెఱుఁగుటలో నిట్టులే తక్కిన భేదంబులలో నే భేదముగునో కనిపట్టవలయును రెండవవిషయము నెఱుఁగుటకు:— చక్రవాకము సంపూర్ణరాగమే కావున నందు వర్జ్యస్వరములు లేవు. మలయమారుతముయొక్క యారోహణావరోహణములలో మధ్యమ మొక్కటి మాత్రము వర్జింపఁబడినది. సావేరికి ఆరోహణమందు గాంధార నిషాదములు వర్జింపఁబడినవి. అవరోహణము సంపూర్ణమైయున్నది. ఛాయాసింధునకు ఆరోహణమందు గాంధారనిషాదములు వర్జింపఁబడినవి. అవరోహణమందు నిషాదము మాత్రము వర్జింపఁబడినది. ఇట్టులే కొదువరాగముల వర్జ్యముల నెఱుఁగునది.

ఇఁక మూఁడవనాల్గవ విషయములందుఁ గోరబడినట్లు ఈ రాగము ఎన్నవమేళకర్త యని గాని లేక యెన్నవమేళకర్తయందు జనించె నని కాని విచారింపవలసియున్నది. ఇట్లు మేళకర్తయొక్క సంఖ్యను విచారించుటకుఁ గారణ మేమనఁగా:—ఈ స్వరములో నొక్కొక్కటి రెండు మూఁడు శ్రుతులకుఁ బ్రతినిధియై యుండుననియు, ఒక్క రాగమును బాడునపుడు ఒక్క శ్రుతిని మాత్రమే యా స్వర మాశ్రయించియుండుట శాస్త్రసమ్మతమనియు ముందొకచోఁ దెల్పఁబడెఁగదా; ఈ రాగమును బాడునపు డా స్వరము తనకుఁ గల రెండుమూఁడు శ్రుతులలో నేశ్రుతి నాశ్రయించియున్నదో తెలియవలసియుండుటయే కారణము. ఒక మేళకర్తయందు జనించిన రాగము లన్నియు నా మేళకర్తకుఁ గల స్వరస్థానములనే యనుసరించి యుండునుగాని వేఱుగా నుండవు. కావుననే యా మేళకర్తను దెలిసికొనుట యావశ్యకమయ్యెను. అట్లయినచో మేళకర్తయొక్క పేరును దెలిసికొనరాదా, దాని సంఖ్య నేటికిఁ గోరవలయునని శంక వొడమవచ్చును. ఏలయనఁగా.—14 శ్రుతులను బ్రస్తరింపఁగా 72 రాగభేదములు కలిగినవి. ఆ రాగభేదములకు సంఖ్య తెలియునట్లు పేళ్ళు అనంతరమందు బెట్టఁబడినవి కావున రాగనామములకింటె రాగము తే

---

*సరిగమపధనిస అనునప్పుడు చివర 'స' అనునది పైస్థాయిలోఁ బ్రథమస్వరముగాన సము లెలిమిది యని తలంపఁగూడదు.

ముందు పుట్టినవి. ఆ రాగముల పుట్టుక ప్రస్తారక్రమము ననుసరించి యున్నది. ప్రస్తారక్రమమునకును దానివలన జన్మించిన రాగభేదముల సంఖ్యకును అవినాభావసంబంధము కలదు. కావున మేళకర్తయొక్క పేరు కంటె సంఖ్యయే యెక్కుడుముఖ్యముగఁ గోరఁబడినది. మేళకర్తయొక్క సంఖ్య నెఱుఁగుటకుగాను మేళకర్తల ప్రస్తారక్రమము నెఱుఁగవలసియున్నది. ఆ ప్రస్తారము నెఱుఁగుటకుఁ బూర్వము ప్రస్తరింపఁబడిన శ్రుతుల వివిధనామముల నెఱుఁగవలసియున్నది. అవి యిట వివరింపఁబడును. షడ్జ పంచమములకు శ్రుతిభేదమే లేదనియు మిగిలిన 'రిగమధని' యను నైదు స్వరముల శ్రుతిభేదములే ప్రస్తరింపఁబడెననియు ముందు వివరింపఁబడి యుండెఁగదా. ఆ శ్రుతిభేదముల నామము లిట్లెఱుంగనగును.

| | | | |
|---|---|---|---|
| రి | శుద్ధఋషభము | చతుశ్శ్రుతిఋషభము | షట్శ్రుతిఋషభము |
| గ | శుద్ధగాంధారము | సాధారణగాంధారము | అంతరగాంధారము |
| మ | శుద్ధమధ్యమము | ప్రతిమధ్యమము | ... ... |
| ధ | శుద్ధధైవతము | చతుశ్శ్రుతిధైవతము | షట్శ్రుతిధైవతము |
| ని | శుద్ధనిషాదము | కైశికినిషాదము | కాకలినిషాదము. |

ఈ యైదుస్వరములు నీ నామభేదముల నందుటచే వికృతిస్వరము లనఁబడుచున్నవి. కాని ప్రకృతిస్థానములందున్నపుడు అనఁగా నియత శ్రుతులతో నున్నపుడు ప్రకృతులనిపించుకొనును. షడ్జ పంచమముల కీ భేదములు లేవు గనుక నవి ప్రకృతులనఁబడుచున్నవి.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | శు,రి | చ,రి / శు,గా | ష,రి / సా,గా | అం,గా | శు,మ | ప్ర,మ | ప | శు,ధై | చ,ధై / శు,ని | ష,ధై / కై,ని | కా,ని |

ఇందు చతుశ్శ్రుతిఋషభమే శుద్ధగాంధారముగాను,
షట్శ్రుతిఋషభమే సాధారణగాంధారముగాను,
చతుశ్శ్రుతిధైవతమే శుద్ధనిషాదముగాను,
షట్శ్రుతిధైవతమే కైశికినిషాదముగాను,

షూఱుచుండెననియు, ఏరాగమందైన నీ జంటలో నొకటి మాత్రమే యుండుననియుఁ జదువరులు ముఖ్యముగ గమనింపవలయు. అనఁగా నీ జంటలోని రెండును ఒక్కధ్వనికిఁ జేర్లే గావున నేరాగమందైన నీ జంటలో నొకటిమాత్రమే యుండు నని గ్రహింపవలయు. ఈ వికృతులంబొందిన స్వరపంచకముచేత నే ప్రస్తారవశంబున డెబ్బదిరెండు భేదంబు లేర్పడె. ఆ ప్రస్తారక్రమ మిట సంగ్రహముగ వివరింపఁబడును.

## ప్రస్తారక్రమము

శుద్ధఋషభముమీఁద మూఁడుగాంధారములును రాఁగలవు. చతుశ్శ్రుతిఋషభమే శుద్ధగాంధారమగును గాన దానిపైని రెండు గాంధారములు మాత్రమే రాఁగలవు షట్ఛ్రుతిఋషభమందే సాధారణ గాంధారము పుట్టుచుండెఁ గాన దానిపై నంతరగాంధార మొక్కటిమాత్రమే రాఁగలదు. వీనివలన నాఱుభేదంబులు కలుగుచున్నవి. ఇట్లే ధైవత నిషాదములందును ఆఱుభేదములు పుట్టుచున్నవి పైఁజెప్పఁబడిన ఋషభ గాంధారముల భేదములలో నొక్కొక్కదానికీ ధైవతనిషాదభేదంబు లాఱింటిని జేర్పఁగా ముప్పదియాఱు భేదంబు లగును. వీనినే ప్రతిమధ్యమభేదంబులు రెంటిచే రెట్టింపఁగా డెబ్బదిరెండుభేదము లగుచున్నవి. ఆ వివర మీ దిగువ పథకములందు సంగ్రహముగఁ జూపఁబడును.

## రాగప్రస్తార పథకము.

| 1 వ చక్రము | | ధ | ని |
|---|---|---|---|
| శు, రి | శు, గా | శు | శు |
| ,, | ,, | శు | కై |
| ,, | ,, | శు | కా |
| ,, | ,, | చ | కై |
| ,, | ,, | చ | కా |
| ,, | ,, | ష | కా |

| | |
|---|---|
| 2-వ చక్రము | శు, రి; సా, గా, |
| 3-వ చక్రము | శు, రి, అం, గా, |
| 4-వ చక్రము. | చ, రి; సా, గా, |
| 5-వ చక్రము | చ, రి; అం, గా, |
| 6-వ చక్రము. | ష, రి; అం, గా. |

వీనినే ఋషభగాంధారభేదముల నొకచక్రముగఁ జేసి ధైవతనిషాద భేదములచేత హెచ్చించి గాని మఱియొకవిధముగాఁ గాని ప్రస్తరింప వచ్చును. అందుచేత నొక్కొక్క మేళకర్తయొక్క సంఖ్య భేదించును గాని మొత్తముసంఖ్య డెబ్బదిరెండుగానే యుండును. ఇచ్చట వివరింపఁ బడినది పెద్దలచేత నేర్పఱుపఁబడిన మార్గము. మొదటిచక్రమునందు వలెనే తక్కిన ప్రతిచక్రమునందును ధైవతనిషాదభేదములు చేర్పఁబడ వలయును ఈ పథకములందు మధ్యమభేదములు చూపఁబడలేదు. కావున నీ ముప్పదియాఱింటికి శుద్ధమధ్యమమును జేర్చి మఱియొక ముప్పదియాఱింటికిఁ బ్రతిమధ్యమమును జేర్పవలయును. అప్పుడు డెబ్బదిరెండు భేదము లగును. ఈ డెబ్బదిరెండుభేదములే మేళకర్తలనియు, జనకరాగములనియు సంపూర్ణరాగములనియుఁ బిలువఁబడుచున్నవి. ఇదియే ప్రస్తారవినగము. ఈ కఠినమగు ప్రస్తారక్రమము నిట వివరించి యాయాసపఱచినందులకుఁ జదువరులు మన్నింతురుగాక.

క్రమపడి గ్రహించిన యీ ప్రస్తారమునలనఁ బ్రయోజన మేమనఁగా —మలయమారుతరాగమునకు ఏగాంధారము ఏనిషాదము పాడవలయు నన్న సందేహము కలిగెననుకొనుఁడు. ఇది యేమేళకర్తయందు జనించెనో ఆమేళకర్త యెన్నవదియో ముందు విచారింపవలయు. అందుకు సాధారణముగాఁ బలువురు పాడునట్టి రాగములు అకారాదిగ వానిమేళ కర్తల సంఖ్యలతోడ వేఱొకపుటయందు ముద్రింపఁబడినవి. దానియందుఁ జూడనగును. అంతట నిది పదియాఱవమేళకర్తయగు చక్రవాకమందు జనించెనని తెలియును. ఆమేళకర్తకు ఏ గాంధార నిషాదములు కలవో కనుగొనుటకుఁ బై ప్రస్తారచక్రములఁ జూడవలయు. పదియాఱవమేళకర్త యనఁగా మూఁడవచక్రంబున నాలుగవభేదము కదా. మూఁడవచక్రంబున కంతటికిని అంతరగాంధారమని యా చక్రము వలనఁ దెలియును. ప్రతిచక్రంబున నాల్గవభేదమునకు కైశికనిషాద ముండుననియుఁ దెలియును. ఆ గాంధారనిషాదములే మలయమారుత రాగంబునకుఁ గలవని గ్రహింపవలయును. ఇట్లు గ్రహించుకొనుటకే యీ

పాడఁదలచిన రాగ మెన్నవ మేళకర్తయో లేక యెన్నవ మేళకర్తయందు జన్మించెనోయను విషయము తొలుదొల్తనే విచారణీయ మయ్యెను.

ఐదవదియగు రాగవక్రతావిషయ మిపుడు విచారింపవలసియున్నది. దీనికొఱకు విశేషప్రయాస మక్కఱలేదు. హిందోళమునకు ఆరోహణమందు సగమ అని క్రమముగాఁ బోవుటకు బదులు సమగమ అని వక్రమయినది. అవరోహణమందు పంచమఋషభములు వర్జ్యమయినవి. శుద్ధ సావేరికి ఆరోహణమందు ఋషభనిషాదములు వర్జ్యమయినవి. అవరోహణమందు పమరిస అని క్రమముగా దిగుటకు బదులు పమరిగరిస అని వక్రమార్గమున దిగినది. ఇట్లుచే కొన్ని రాగములకును వక్రముల నెఱుఁగునది గ్రంథాధారము చేతఁ గాని యెదుటఁ బాడఁదలచియున్నవారి వలనఁ గాని "ఈ రాగమునకు వక్రగతి కలదా? ఉన్నచో నది యెచటఁ గలదు?" అని యడిగి తెలిసికొని యా వక్రస్థానమందుఁ దాను సక్రమముగాఁ బోక యా వక్రగతినే పోవుచుండవలయును ఏదైన నొక నూతన రాగమును ఎదుటి విద్వాంసునితోఁ గలసిపాడవలసిన పట్టున తెలిసికొంచి నపుడే రాగవక్రతను గుర్తించి యొండొరుల ననుసరించుట యవసరమగును. ఒక్క వక్రతవిషయమే కాదు పై యైదు విషయములును ప్రాథమముగ నొండొరులచే స్పష్టపఱుపఁబడవలసినవే అట్లొనర్చుట సక్రమపద్ధతియే గాని న్యూనత కాదు.

ఈ యైదుమార్గముల గ్రహించి పిమ్మట నెవ్వరైన నిష్టమువచ్చినట్టులు పాడుకొనవచ్చును. వీనిని బోధనక్రమమున వ్రాయుటచేత నిట్టులు విస్తారముగా నుండినట్లు కనఁబడును గాని యడిగి తెలిసికొనినచో నైదు ప్రశ్నములకు వలయు ప్రత్యుత్తరములను న ర ని ము స ము లోఁ బడయవచ్చును. హార్మోనియం, ఫిడేలు, వీణ మొదలగు వాద్యములపైని ఆ స్వరస్థానముల మాత్రము తెలిసికొని యిష్టమువచ్చినట్లు వాయింపఁజొచ్చినచో ఆ రాగము వినఁబడుచునేయుండును. ఇట్టులు తాను కోరినట్టులు ఏరాగమునైన నప్పటికప్పుడు వాయింప వచ్చును.

అయిన నింతవఱకు రాగమునకు వలయు లక్షణములఁగూర్చియే చెప్పఁబడెను గాని రాగమును బెంచిపాడుటకు వలయు మార్గములు వచింపఁబడ లేదు. పెంచిపాడుటకుఁ బాడకుని స్వకీయమగు కల్పనాసామర్థ్యము మిక్కిలిగ నవసరమే గాని యట్టి కల్పనకు వలయు మార్గములును నిబంధనలును గూడఁ బెద్దలగు భరతాచార్యులచేతనే యేర్పఱుపఁబడినవి. అవియు నిట సంగ్రహముగ వివరింపఁబడును.

## దశవిధగమకములు.

శ్లో॥ ఆరోహ మవరోహంచ ఢాలు స్ఫురిత కంపితాః ।
ఆహాతః ప్రత్యాహతశ్చ త్రిపుచ్ఛాందోళ మూర్ఛనాః॥

| | |
|---|---|
| 1 ఆరోహణము. | సరి గమ పధ నిస |
| 2 అవరోహణము. | సని ధప మగ రిస. |
| 3 ఢాలు. | సప, సమ, సగ, సరి, సస. |
| 4 స్ఫురితము. | ససరిరి, గగ మమ. |
| 5 కంపితము. | పాపపప ఒక్క స్థానమందు నిలిచి తంత్రి నల్లార్చుట. |
| 6. ఆహతము. | సరి రిగ గమ |
| 7. ప్రత్యాహతము. | సని నిధ ధప. |
| 8. త్రిపుచ్ఛము. | ససస, రిరిరి, గగగ, మమమ. |
| 9. ఆందోళము. | సరిస పాప, రిగరి మామ. |
| 10. మూర్ఛన. | సరిగమపధని, రిగమపధనిస. |

స్వరములు మఱియు నాలుగువిధముల నడచుచుండును. వానికి వాది, సంవాది, వివాది, అనువాది అని నాలుగు పేళ్లు కలవు.

## ఉదాహరణములు.

వాదిస్వరము. సరిగమ పధనిస, రిగమ పధనిస, గమ పధనిస, మపధనిస, పధనిస, ధనిస, నిస, స

సంవాదిస్వరము. సనిధపమగరిస, నిధపమగరిస, ధపమగరిస, పమగరిస, మగరిస, గరిస, రిస, స.

వివాది స్వరము. సమ్మగరి సరిగమ, రిప్పమగ రిగమప, గద్ధపమ గమపధ, మన్నిధప మపధని, పస్సనిధ పధనిస.

అనువాదిస్వరము. సరిగ, రిగమ, గమప, మపధ, పధని, ధనిస.

ఈ దశవిధగమకములను, చతుర్విధ మార్గములను తెలిసి యుపయోగింపఁ జొచ్చినచో రాగము నెంతసేపైనను బాడుకొను సమర్థత కలుగును.

ఇంతగాక ప్రతిరాగమునకును జీవకళలుండును. అవి యొక్కొక్క రాగమునకు ఒకటి లేక అంతకన్న నెక్కుడు స్వరములపై నుండును. ఆ స్వరములను ఆ జీవకళ కనఁబడునట్లులు కొంచెము దీర్ఘముగా వరకు మొదలైన యేదోయొక గమకముతోఁ జేర్చి యా రాగముయొక్క ఆరోహావరోహముల నొక్కతూరి వాడుట యా రాగముయొక్క మూర్ఛన యనఁబడును. అట్టి మూర్ఛన ప్రతిరాగమునకు నుండును వీనిని గూర్చి భరతాచార్యులు తగిన యాధారముల వ్రాసియే యుందురు. కాని ప్రస్తుతకాలపు సంగీతగ్రంథములందు అట్టివి కానరావు వానిని ఆచారము చేతను, అనుభవముచేతను మాత్రమే తెలిసికొనఁదగియున్నది. అట్టి వానిలోఁ బది దృష్టాంతములకు మాత్ర మిట వివరింపఁబడుచున్నవి.

1. అసావేరి సరిమపధస సనిధపమగరిస.

కా కై
సని సపాధమాప ని ధపమగారిస

ఔడవసంపూర్ణ రాగము. అవరోహణమందు గాంధారము రాగచ్ఛాయా స్వరము. [illegible]

2. కమాసు- సమగమ పధనిస - సనిధప మగరిస.

వక్రషాడవ సంపూర్ణ రాగము. ఆరోహణావరోహణములయందు మధ్యమ ధైవత నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. [illegible]

3. కాంభోజి- సరిగమపధస - సనిధప మగరిస.

ఔడవసంపూర్ణరాగము ఆరోహణమందు సనిపధస అను కాకలినిషాదమును అవరోహణమందు కైశికినిషాదమునుగలవు. సర్వస్వరరాగచ్ఛాయగలది.

4. గౌళ— సరిగ మరి మ ప నిస — సని ప మ గ మ రి స.

వక్ర షాడవరాగము. ఆరోహణావరోహణములందు శుద్ధఋషభము రాగచ్ఛాయాస్వరము

5. ధన్యాసి— స గ మ ప ని స—స ని ధ ప మ గ రి స.

ఇది ఔడవ సంపూర్ణము. ఆరోహణమందు నిషాదమును, అవరోహణమందు ధైవతి గాంధారములును రాగచ్ఛాయా స్వరములు.

6 నాదనామక్రియ—ని స రి గ మ ప ధ ని — ని ధ ప మ గ రి స ని.

నిషాదమధ్యసంపూర్ణరాగము. ఆరోహణమందు మధ్యమ ధైవతములును, అవరోహణమందు గాంధారఋషభనిషాదములును రాగచ్ఛాయాస్వరములు.

7. నీలాంబరి—సరిగమ పధ పనిస—సని పమగ రిగస.

వక్ర సంపూర్ణ షాడవరాగము. అవరోహణమందు నిషాద మధ్యమ ఋషభములు రాగచ్ఛాయాస్వరములు.

8. ముఖారి— స రి మ ప ని ధ స—స ని ధ ప మ గ రి స.

వక్ర షాడవసంపూర్ణరాగము. ఆరోహణమందు నిషాద చతుశ్శ్రుతి ధైవతములును, అవరోహణమందు శుద్ధ ధైవతి సాధారణగాంధారములును, రాగచ్ఛాయా స్వరములు.

9. సావేరి— స రి మ ప ధ స — స ని ధ ప మ గ రి స.

ఇది ఔడవ సంపూర్ణరాగము ఆరోహణావరోహణములయందు మధ్యమ ధైవతములు రాగచ్ఛాయా స్వరములు.

10. శ్రీరాగము— స రి మ ప ని స — స ని ప ధ ని ప మ రి గ రి స.

ఔడవ వక్రసంపూర్ణరాగము. ఆరోహణమందు నిషాదమును, అవరోహణమందు ఋషభ గాంధారములును రాగచ్ఛాయా స్వరములు.

ఇవ్విధంబుగ ముందు మొదటఁ దెల్పఁబడిన యైదువిషయంబులను, అనంతరము దశవిధగమకములను చతుర్విధ మార్గములను మూర్ఛనలను, దెలిసి రాగమును బాడవలయును.

ఉ. పాడుగఁ దొల్త వర్జ్యముల • వక్రములన్ శ్రుతులన్ గ్రహించి, సం
పాదిత మార్గుఁడై గమక • పద్ధతులన్ బదిలింబఠించి, సం
వాది వివాది వాది యను • వాది యనంచగు నాల్గుత్రోవలన్
బ్రోదిగ నేర్చి, మూర్ఛనల • పొందుగ రాగముఁ బాడఁగావలెన్.

## 6. మేళకర్తల నామవిమర్శనము.

### 72 మేళకర్తల నామములు.

| | | |
|---|---|---|
| 1. కనకాంగి. | 25. మారరంజని. | 49. ధవళాంబరి. |
| 2. రత్నాంగి. | 26 చారుకేశి | 50. నామనారాయణి. |
| 3. గానమూర్తి. | 27. సరసాంగి. | 51 కామవర్ధని. |
| 4. వనస్పతి. | 28. హరికాంభోజి. | 52. రామప్రియ. |
| 5 మానవతి. | 29. ధీరశంకరాభరణము. | 53. గమనశ్రియ |
| 6. తానరూపి. | 30. నగానందిని. | 54. విశ్వంభర |
| 7. సేనాపతి. | 31. యాగప్రియ. | 55. శ్యామలాంగి |
| 8 హనుమత్తోడి. | 32. రాగవర్ధని. | 56. షణ్ముఖప్రియ. |
| 9. ధేనుక | 33 గాంగేయభూషణి. | 57. సింహేంద్రమధ్యమ. |
| 10. నాటకప్రియ. | 34. వాగధీశ్వరి. | 58 హేమవతి. |
| 11 కోకిలప్రియ. | 35. శూలిని. | 59 ధర్మవతి. |
| 12. రూపవతి. | 36 చలనాట. | 60. నీతిమతి. |
| 13. గాయకప్రియ. | 37. సాలగము. | 61 కాంతామణి. |
| 14. వకుళాభరణము. | 38 జలార్ణవము. | 62 రిషభప్రియ. |
| 15. మాయామాళవగౌళ. | 39 ఝాలవరాళి. | 63. లతాంగి |
| 16. చక్రవాకము. | 40. నవనీతము. | 64. వాచస్పతి. |
| 17. సూర్యకాంతము. | 41. పావని | 65. మేచకళ్యాణి. |
| 18. హాటకాంబరి. | 42. రఘుప్రియ. | 66. చిత్రాంబరి. |
| 19. ఝంకారధ్వని. | 43. గవాంభోధి. | 67. సుచరిత్రము. |
| 20. నటభైరవి. | 44. భవప్రియ | 68. జ్యోతిస్స్వరూపిణి. |
| 21 కీరవాణి | 45. శుభపంతువరాళి | 69. ధాతువర్ధని. |
| 22. ఖరహరప్రియ. | 46 షడ్విధమార్గిణి | 70 నాసికాభూషణము. |
| 23. గౌరీమనోహరి. | 47 సువర్ణాంగి. | 71. కోసలము. |
| 24. వరుణప్రియ. | 48. దివ్యమణి. | 72. రసికప్రియ. |

ఇందొక చిత్రము కలదు మొదట నీ మేళకర్తరాగంబులు ప్రస్తారక్రమంబున సృష్టింపఁబడి యనంతర మా రాగంబులకు, వాని నామాక్షరనియమముచేతఁ బ్రస్తారక్రమమందలి వాని సంఖ్య తెలియునట్టులు, నామములు కుదుర్పఁబడినవి. ఆ నియమ మిట వివరింపఁబడును.

## మేళకర్తల నామాక్షరనియమము.

ఈ నియమమందు 1 కాదినవ, 2 టాదినవ, 3 పాదిపంచ, 4 యాద్యష్ట, 5 నకారము శూన్యార్థకము అను నైదు సూత్రంబులు కలవు. వీని భావ మేమనఁగా:—

1. కాదినవ అనఁగా కకారము మొదలు తొమ్మిది అని యర్థము. కఖగఘఙచఛజఝ అను నీ తొమ్మిదియక్షరములును కాదినవ అనఁబడును. ఈ తొమ్మిదియక్షరములును ఒకటిమొదలు తొమ్మిదివఱకుఁ గల సంఖ్యలకుఁ బ్రతినిధులై నిలుచుట కుద్దేశింపఁబడినవి. ఇట్టులే కడమవానియందును గ్రహించునది.

2. టాదినవ=టకారము మొదలు తొమ్మిది. ట ఠ డ ఢ ణ త థ ద ధ ఇవి టాదినవ అనఁబడును.

3. పాదిపంచ=పకారము మొదలు అయిదు. ప ఫ బ భ మ.

4. యాద్యష్ట=యకారము మొదలు ఎనిమిది. య ర ల వ శ ష స హ.

5. నకారము శూన్యార్థకము=నకారము 'సున్న' అని యర్థము.

డెబ్బది రెండు మేళకర్తల సంఖ్యలందు, ఒకట్లు పదులు నను రెండు స్థానంబులే యుండునుగాన నీ సూత్రపంచకమునుండి యా రెండుస్థానము లందలి యంకెలకును బ్రతినిధులుగ నుండఁదగిన రెండక్షరములను ముందు గొని వానిని నామముయొక్క మొదట నుంచి యనంతరము నామ ఘటనకై కొదువ యక్షరములు కొన్ని వానికిఁ జేర్పఁబడినవి. ఉదాహరణములు:—

1. కనకాంగి— ఇందలి కకారము కాదినవకంబున నొకటవ యక్షరము గాన ఆ యొకటిని ఏకస్థానంబుననుంచి, రెండవయక్షరమగు నకారము శూన్యార్థకము గాన దాని సున్నను పదులస్థానంబున నుంచ వలయు. అపుడుసంఖ్య '01' అగును పూర్వమందు సంఖ్యలేని సున్న వ్యర్థముగాన నీ సంఖ్య ఒకటి యనఁబడును. కావున నీ రాగంబును ఒకటవ మేళకర్త యని చెప్పవలయు.

2. రామప్రియ—ఇందలి యొకటవదగు రేఫాక్షరము యాద్యష్ట కంబున రెండవయక్షరము కాన నొకట్లస్థానంబున రెండు నుంచవలయు. రెండవదగు మకారము పాదిపంచకంబున నైదవదిగాన పదులస్థానంబున నైదు నుంచవలయు. అపు డిట్లు 52 అగును. ఈ రాగము 52 వ మేళకర్త.

3. రసికప్రియ—ఇందలి రేఫమును, సవర్ణమును యాద్యష్టకమున రెండు, ఏడు, సంఖ్య లగును. కావున నిది 72 వ మేళకర్త.

ప్రత్యేకసూత్రము—(Special rule.)

ఈ మేళకర్తనామముల ప్రథమద్వితీయాక్షరములలో సంయుక్తాక్షరములు గలప్పుడు ఆ సంయుక్తాక్షరములలో రెండవయక్షరసంఖ్యనే గ్రహింపవలయు. ఉదా, షడ్విధమార్గిణి, ధర్మవతి. ఇందలి వకారమకారముల సంఖ్యలగు 4, 5 నే గ్రహింపఁబడవలయును.

అక్రమములు.

పై విధంబున సంఖ్యను గనుఁగొనుట కనుకూలించునట్టు లొనర్పుటకై సింహేంద్రమధ్యమ అను నామము సిమ్హేంద్రమధ్యమ అని తప్పుగా మార్పఁబడినది. మఱియు ఋషభప్రియ అను నామము రిషభప్రియ అని మార్పఁబడినది. ఋషభము అనునది రిషభము అని వాడుకలో నుండుట కిది యొక కారణమై యుండు నని యూహింపఁదగియున్నది.

సూత్రాతిక్రమణములు.

16 చక్రవాకము, 48 దివ్యమణి, 54 విశ్వంభర, 55 శ్యామలాంగి, 66 చిత్రాంబరి, 68 జ్యోతిస్స్వరూపిణి అను నీ నామముల సంయుక్తాక్షరములందు మాత్రము మొదటియక్షరముల సంఖ్యనే గ్రహింపవలయు.

ఈ నియమములచేత మేళకర్తయొక్క నామమునుబట్టి సంఖ్యను గనుఁగొననగును. సంఖ్యనుబట్టి నామమును దెలిసికొనుటకు మాత్రము మార్గ మేర్పఱుపఁబడ లేదు. సంఖ్య తెలిసినవెనుక నామముతో నవసరము లేకుండుటయే యిందులకుఁ గారణము. ఏలయన:—సంఖ్య తెలిసినతోడనే ప్రస్తారక్రమంబున దాని స్వరస్థానముల సులభంబుగ గ్రహింప

B. K. Raghavendra Rao

షమును, ఎనిమిది నిమిషము లొక కళయు నగును నాలుగు కళ లొక యనుద్రుత మగును రెండు అనుద్రుతము లొక ద్రుతము, రెండు ద్రుతము లొక లఘువు, రెండులఘువు లొక గురువు, మూఁడు లఘువు లొక ప్లుతము, నాలుగు లఘువు లొక కాకపాదము అని చెప్పఁబడును. వీనిలో నను ద్రుతము మొదలుకొని యాఱంగములు మాత్రమే వాడుక లోనికి వచ్చును.

## 2. మార్గప్రాణలక్షణము.

దక్షిణము, వార్తికము, చిత్రము, చిత్రతరము, చిత్రతమము, అతి చిత్రము అని మార్గములు ఆఱువిధములై యున్నవి. వీనిలో దక్షిణ మార్గమం దెనిమిదిమాత్ర లొక్కకళ యనఁబడును. వార్తికమున నాలుగు మాత్రలును, చిత్రమున రెండుమాత్రలును, చిత్రతరమున నొక్కమా త్రయు, చిత్రతమమున నరమాత్రయు నొక్క కళ యనంబడును. అతి చిత్రమార్గమున ననుద్రుతమే యొక్క కళ యనఁబడును. ఇచటఁ గళ యనఁగాఁ దాళాక్షరములమధ్య నడుచు కాలము అని తెలియవలెను. అనుద్రుతమనఁగా నేకాక్షరకాలమని యంగప్రాణమును వివరించునపుడు తెలియును. దానిచేత మాత్రయనఁగా నాలుగక్షరముల కాలమనియు, నిట్లే దక్షిణమార్గమందు ముప్పదిరెం డక్షరములు నడుచుననియు గ్రహింపవలయును. తాళముయొక్క యొక యక్షరమునుండి మఱియొక యక్షరమువఱకు జరుగు కాలమున నోట నుచ్చరింపఁబడెడి లఘ్వక్షరముల పరిమితిని నిర్ణయించుట కేర్పడినది మార్గప్రాణము దీనిచేత మార్గము లందు 1, 2, 4, 8, 16, 32 సంఖ్యలుగల యక్షరములు ఆఱుకాలముల యందును గ్రమంబుగ నడువవలయుఁ గాని 3, 7, 9 మొదలగు సంఖ్యలు నడువఁగూడ దని తెలియుచున్నది.

## 3. క్రియాప్రాణలక్షణము.

ఈ క్రియలు మార్గక్రియలు, దేశ్యక్రియలు నని రెండువిధములు. అందు మార్గక్రియలు నిశ్శబ్దక్రియలు, సశబ్దక్రియలు నని మరల రెండు విధములు.

## నిశ్శబ్దమార్గక్రియలు.

ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము అను నీ నాలుగును నిశ్శబ్దక్రియలు. ఆవాపము అనఁగా పతాకహస్తముయొక్క తర్జని మొదలు నాలుగ్రేళ్లను మడుచుట; నిష్క్రామ మనఁగా ఆ మడిచిన వ్రేళ్లను విప్పి పొడవుగాఁ జాఁచుట; విక్షేపము అనఁగా ఆ హస్తమును కుడిపార్శ్వమునకు విసరుట; ప్రవేశ మనఁగా ఆ హస్తమును అప్రదక్షిణముగాఁ గ్రిందుగా ముందరికి రానిచ్చుట.

## సశబ్దమార్గక్రియలు.

ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము అను నీ నాలుగును సశబ్దక్రియలు. ధ్రువము అనఁగా శబ్దసహితమైన చిటికను వేయుట; శమ్యము అనఁగా కుడిచేతిమీఁద ఎడమచేతితో ఘాత వేయుట; తాళము అనఁగా ఎడమచేతిమీఁద కుడిచేతితో ఘాత వేయుట; సన్నిపాతము అనఁగా రెండు చేతుల ఘాతలును సమముగా పడుట.

## దేశ్యక్రియలు.

ధ్రువక, సర్పిణి, కృష్య, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అను నీ యెనిమిదియు దేశ్యక్రియలు 1 ధ్రువకము అనఁగా కుడిహస్తము యొక్క శబ్దసహితమైన చిటిక లేక ఘాత, 2 సర్పిణి యనఁగా పతాకహస్తముచేత నెడమవంకకుఁ జేయి చాఁచుట; 3 కృష్య యనఁగా ఆ హస్తము నెడమనుండి కుడిప్రక్కకుఁ దెచ్చుట; 4 పద్మిని యనఁగా నధోముఖముగాఁ జేతిని జాఁచుట; 5 విసర్జిత యనఁగా ఆ చేతిని వెలుపలకు విసరుట; 6 విక్షిప్తయనఁగా ఆవ్రేళ్లన్నిటిని ముడుచుట; 7 పతాకము అనఁగా వ్రేళ్లను జాఁచి పతాకహస్తముగా నెత్తుట, 8 పతిత యనఁగా ఎత్తిన హస్తమును దించుట.

ఈ యెనిమిది దేశ్యక్రియలలో ధ్రువక అనునది యొక్కటి మాత్రమే సశబ్దక్రియ యని యెఱుంగునది. ఈ క్రియలలో బెక్కులు సప్తతాళములం దవసరము లేవు. అవసరముగల కొన్నియైన నెదుట నొకరు వేయునపుడు చూచినయెడ నంతలోఁ దెలియును.

## 4. అంగప్రాణలక్షణము.

తాళాంగములు ఆఱు కలవు. వాని నామములును సంజ్ఞలును అక్షరకాలమును ఈ దిగువ పథకమందు వివరింపఁబడును.

### తాళ షడంగ వివరణము

| షడంగముల పేళ్లు. | అంగ సంజ్ఞలు. | అక్షర కాలము. | |
|---|---|---|---|
| అనుద్రుతము. | ◡ | 1 | వీనిలో మొదటిమూఁడంగములు |
| ద్రుతము. | ○ | 2 | మాత్రమే సప్తతాళములలో వచ్చు |
| లఘువు. | 1 | 4 | ను. మఱియు షోడశాంగములుగలవు |
| గురువు. | § | 8 | ఇచటవానివివరణ మనవసరమగును |
| ప్లుతము. | 3 | 12 | అవి నూటొక్క తాళములందు వ |
| కాకపాదము. | + | 16 | చ్చును. |

వీనిలో కాకపాదమును సర్పిణి కృష్య పతాక పతిత యను నీ నాలుగు నిశ్శబ్దక్రియలచేతను, ప్లుతమును ధ్రువక సర్పిణి కృష్య యను మూఁడు క్రియలచేతను, గురువును ధ్రువక పతిత యను రెండుక్రియల చేతను, లఘుద్రుతానుద్రుతములను ధ్రువక యనెడి క్రియచేతను వాడ వలయును.

### అనుద్రుత ద్రుత లఘువుల వాడుక.

అనుద్రుతము—ఒక్క ఘాతను వేయుటచేత నొక్క యక్షరపు కాలమై యనుద్రుత మగును. ఇది సప్తతాళములలో నొక్క జంపెతాళ మందు మాత్రమే వచ్చును.

ద్రుతము—ఒక్క ఘాతను వేసి పతాకహస్తముగా నఱచేతిని బైకి త్రిప్పుటచేత నది రెండక్షరముల కాలమై ద్రుత మనఁబడును. ఈ రెండుక్రియలను దెబ్బ, ఉసి యని సాధారణముగఁ బెక్కండ్రు వాడుచుందురు.

లఘువు—ఒక్క ఘాతను వేసి కనిష్ఠిక మొదలు మూఁడువ్రేళ్ళతో మూఁడక్షరములను వేసినచో మొత్తమున నాలుగక్షరములై యొక్క చతురశ్రజాతి లఘు వగును. ఇట్లే త్రిశ్రజాతిలఘువునకు ఒక్క ఘాతను రెండక్షరములను, ఖండజాతిలఘువునకు ఒక్కఘాతను నాలుగక్షరములను వేయవలెను. మిశ్రజాతిలఘువునకుఁ గల యేడక్షరములకు నొక్క ఘాతను వేసి కనిష్ఠిక మొదలుకొని యైదు వ్రేళ్ళను వేసి మరలఁ గనిష్ఠికను గూడ వేయవలెను సంకీర్ణజాతి లఘువునకుఁ గల తొమ్మిదియక్షరములను నిట్లే వేయవలయును.

ఈ మూఁడంగములను మాత్రము చక్కఁగ నభ్యసించినచో సప్తతాళముల ననర్గళముగ వేయవచ్చును. సప్తతాళములందు నీ మూఁడంగములకన్న వేఱగు నంగములు రానేరావు.

## 5 గ్రహప్రాణలక్షణము.

అతీతము, అనాగతము, సమము, విషమము, నని గ్రహములు నాలుగువిధములు. గీతము నడిచిన పిమ్మటఁ దాళము నడుచుట యతీత మనఁబడును తాళము నడిచిన పిమ్మట గీతము నడుచుట యనాగత మ్మనఁబడును, తాళగీతములు సమముగా నడుచుట సమ మనఁబడును. ఈ మూఁడువిధములకు భిన్నముగా నడచుట విషమ మనఁబడును.

"విషమ మనునది ముందు వెనుక మధ్య గాక మఱి యెచ్చట నుండఁగలదు? కావునలేదు." అని పెక్కండ్రు గాయకులు వాదులాడుచుందురు. కాని యీ విషమ మనునది శాస్త్రమందే కనవచ్చుచున్నది గాని నడుమువచ్చినది కాదు. అతీతానాగతసమగ్రహములు మూఁడును నియమము లేక కలిసి వచ్చుటకు విషమగ్రహ మ్మని దీని భావమై యుండును. ఇందుకు దృష్టాంతముగఁ గొన్నికృతులందుఁ బల్లవి యొక గ్రహమందును జరణము లింకొక గ్రహమందును బ్రారంభమగుచున్నవి. విద్వాంసు లింతకన్న నింకొక మార్గమును గనిపెట్టినయెడ నెప్పటికైన దానిం దెలుపకుందురా,

## 6 జాతిప్రాణలక్షణము.

చతురశ్రము, త్రిశ్రము, మిశ్రము, ఖండము, సంకీర్ణము నని జాతి యైదువిధములుకలదిగా నున్నది. తాళాంగములలో నొక్క లఘువు మాత్రము ఈ జాతిభేదములచే జతురశ్రజాతియందు 4, త్రిశ్ర జాతియందు 3, మిశ్రజాతియందు 7, ఖండజాతియందు 5, సంకీర్ణజాతి యందు 9 అక్షరముల కాలము కలదిగా నూఱును ఈ లఘుభేదము చేతనే సప్తతాళములును ముప్పదియైదు భేదము లగుచున్నవి ఇట్లు తక్కినయంగము లేవియు మార్పునొందవు.

మనుష్య, స్వర్గ, హంస, దేశ్య, చిత్ర, దివ్య, సింహ, వర్ణ, వాద్య, కర్ణాటములు లని లఘువులు 10 విధములనియు, నవి క్రమముగా 4, 3, 7, 5, 9; 6, 8, 10, 12, 16, అక్షరముల కాలము గలవై యుండుననియు మఱియొక నియమము కలదుగాని యది యిట నవసరము

## 7. కళాప్రాణలక్షణము

దీర్ఘాక్షరములును, సంయుక్తాక్షరములకుఁగాని పూర్ణబిందువులకుఁ గాని ముందున్నయక్షరములును గురువు లనఁబడును తక్కినవి లఘువు లనఁబడున్న. ఏకకళ, ద్వికళ, త్రికళ, చతుష్కళ యని కళలు నాలుగు కలవు. ఇందు లఘు వొక్కకళను, గురువు రెండుకళలను, ప్లుతము మూఁడు కళలను, కాకపదము నాలుగుకళలను గలిగియుండును. మఱియు చచ్చ త్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక. సంపద్వేష్ట, ఉద్ఘటము అను నీ యైదు తాళములకును గళలని పేరు కలదు.

## 8 లయప్రాణలక్షణము.

తాళాంతరాళవర్తి యగు కాలము లయ యనఁబడును. అది ద్రుతము, మధ్యము, విళంబము నని మూఁడువిధము లై యుండును. స్వభావసిద్ధమై అనాయాసముగఁ బాడుకొనుట కనుకూలముగ నుండునది మధ్యము అనఁబడును. దీనినే మధ్యమకాలము అందురు. దీనికి రెట్టింపు వేగము గల కాలము ద్రుతకాలము అనఁబడును. మధ్యమకాలములో సగము వేగముగల కాలము విళంబకాలము అనఁబడును.

## 9 యతిప్రాణలక్షణము.

లయప్రవృత్తియొక్క నియమము యతి యనఁబడును. అది సమము, స్రోతోవహము, గోపుచ్ఛము, పిపీలిక, మృదంగము, విషమము నని ఆఱువిధము లై యున్నది.

### యతుల వివరణము.

1. ఏతాళమునకుఁగాని తాళాంగములలో నెవ్వైన §§§, 111, ౦౦౦, నిట్లు సమజాతికలవిగాఁ గూడెనేని యది సమయతి యనఁబడును.

2. తాళాంగములలో నెవ్వైన ◡ ౦ 1 ఇట్లు ప్రవాహమువలె మొదటఁ జిన్నవిగను క్రమక్రమంబుగఁ బెద్దవిగను గూడెనేని యది స్రోతోవహయతి యనఁబడును.

3. తాళాంగములు ఆవృతోకవలె మొదటఁ బెద్దవిగను రాను రాను జిన్నవిగను 2 1 ౦ ◡ నిట్లు కూడెనేని యది గోపుచ్ఛయతి యనఁబడును.

4 ఆద్యంతములందుఁ బెద్దవిగను నడుముకు రాను రాను జిన్నవిగను 2 1 ౦ 1 2 నిట్లు కూడెనేని యది పిపీలికయతి యనఁబడును.

5. నడుమఁ బెద్దవిగను నాద్యంతములందుఁ జిన్నవిగను ౦ 1 2 1 ౦ నిట్లు కూడెనేని యది మృదంగయతి యనఁబడును.

6 తాళాంగములు గొప్పవియుఁ జిన్నవియు హెచ్చుతగ్గులుగాఁ గూడెనేని యది విషమయతి యనఁబడును.

## 10. ప్రస్తారప్రాణలక్షణము.

ఇది సంఖ్య, నష్టము, ఉద్దిష్టము, పాతాళము, ద్రుతమేరువు, లఘుమేరువు, గురుమేరువు, ప్లుతమేరువు, సంయోగమేరువు, ఖండప్రస్తారము నని పదివిధము లై యున్నది ఈ తాళప్రస్తారమార్గంబులు అంగశ్రేణి, సంఖ్యాశ్రేణి, పాతాళము, మహాపాతాళము నను లెక్కలు చెప్పుట కుపయోగించుచున్నవి. ఇందలి మేరువులు నష్టోద్దిష్టమును జెప్పుటకు మాత్రము మిక్కిలిగ నుపయోగించును. అవి యిట నవసరము.

---

తాళము నెదుటివారు వేయునపుడు చూచినయెడ నతిసులభముగ గ్రహింపవచ్చును. ఇందలి క్రియలు మొదలగువాని పేళ్లన్నియుఁ దెలియనివారిని బెదరించుటకు మిక్కిలిగఁ గికివచ్చును.

గీ. అఖిల జగముల జరుగు కా ♦ ర్యములనెల్లఁ
దాళగతి లోన లీనమై ♦ తనరు చుండు
నట్టి తాళగతికి పరి ♦ మాణ విధుల
నరయ కుండిన గానంబు ♦ విరస మగును



## 9 తాళములు ఎన్ని? వాని యుపయోగ మెట్లు.

రాగముల సంఖ్యను నిర్ణయించుటకు వికృతిస్వరములఁ బ్రస్తరించుటచేత 72 మేళకర్త లయ్యెనని చెప్పుటకొక మార్గ మగపడెను గాని యీ తాళసంఖ్యనుగూర్చి చెప్పుటకు అట్టి యాధారము లెవ్వియుఁ గన్పట్టుట లేదు. ఎట్లున్నను గాని యేడు తాళంబులు కలవని యొక నియమము శాస్త్రమునందుఁ గనఁబడుచున్నది అవి యిచట వివరింపఁబడును.

### సప్తతాళములు

శ్లో. ధ్రువో మఠ్యో రూపకశ్చ- ఝంపా త్రిపుట ఏవచ
అటతాళైక తాళౌ చ- సప్తతాళాః ప్రకీర్తితాః

ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము, జంపెతాళము, త్రిపుటతాళము, అటతాళము, ఏకతాళము అను తాళములు ఏడు కలవు. ఈ యొక్కొక్క తాళమునకు అంగములు వేఱువేఱుగఁ గలవు. వాని యంగములు తెలిసినంగాని యీయా జాతులయందే తాళ మెన్నియక్షరములు కలిగియుండునో తెలియదు. కావున నవి యిచట వివరింపఁబడును.

| సప్తతాళములు. | అంగములు |
| --- | --- |
| 1 ధ్రువతాళము | I0II |
| 2 మఠ్యతాళము | I0I |
| 3 రూపకతాళము | 0I |
| 4 జంపెతాళము | I ◡ 0 |
| 5 త్రిపుటతాళము | I00 |
| 6 అటతాళము | II00 |
| 7 ఏకతాళము | I |

ఈ తాళాంగముల నామములును, వాని యక్షరకాలమును 37 వ పుటయందుఁ జూడఁ గలరు.

ఈ తాళాంగములందు లఘు వొక్కటి మాత్రము చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణంబులను నైదుజాతులయందును గ్రమంబుగా 4, 3, 7, 5, 9 అక్షరముల సంఖ్యకలది యగునని జాతిప్రాణలక్షణమందుఁ జెప్పఁబడియుండెఁ గదా. అట్టి జాతిభేదముచే సప్తతాళములందుఁ గలిగిన 35 తాళముల నామములును వాని యక్షరసంఖ్యయు నీ దిగువ పధకమునందుఁ జూపఁబడుచున్నవి.

35 తాళముల పట్టిక.

| తాళములు. | అంగ సంజ్ఞలు | చతురశ్రము 4 | | త్రిశ్రము 3 | | మిశ్రము 7 | | ఖండము. 5 | | సంకీర్ణము. 9 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ధ్రువము | IOII | శ్రీకర | 14 | మణి | 11 | పూర్ణ | 23 | ప్రమాణ | 17 | భువన | 29 |
| 2 మఠ్యము | IOI | సమ | 10 | సార | 8 | ఉదీర్ణ | 16 | ఉదయ | 12 | రావ | 20 |
| 3 రూపకము | OI | పత్తి | 6 | చక్ర | 5 | కుల | 9 | రాజ | 7 | బిందు | 11 |
| 4 జంపె | I∪O | మధుర | 7 | కదంబ | 6 | సుర | 10 | చణ | 8 | కర | 12 |
| 5 త్రిపుట | IOO | ఆది | 8 | శంఖ | 7 | లీల | 11 | దుష్కర | 9 | భోగ | 13 |
| 6 అటతాళము | IIOO | రేఖ | 12 | గుప్త | 10 | లోయ | 18 | విదళ | 14 | ధీర | 22 |
| 7 ఏకతాళము | I | మాన | 4 | సుధ | 3 | రాగ | 7 | రత | 5 | వసు | 9 |

తగువుల తాళములు.

ఇందు ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము ఏకతాళము అనుటతోడనే వీని చతురశ్రజాతులును, జంపె యనఁగానే మిశ్రజాతి జంపెతాళమును, త్రిపుట యనఁగానే త్రిశ్రజాతి త్రిపుటయు, అట తాళము అనఁగానే తానవర్ణములందు ఖండజాతి అటతాళమును ఇతర పాటలయందు ఏడక్షరములగతిగల మఱియొక తాళమును, సాధారణముగ నెల్లరచే గ్రహింపఁబడుచున్నవి. ఊరక గ్రహింపఁబడుటయెగాక సంగీత గ్రంధములందును బ్రాయికంబుగ నిట్లే వాడఁబడుచున్నవి. 2 'చాపు' అను పేరుతోడ మఱియొక తాళము కనవచ్చుచున్నది. ఇందు మార్గ ప్రాణమునకు విరుద్ధముగఁ దాళాక్షరమున కొక్కొక్కటికేడు స్వరాక్షరముల చొప్పున గతి నడుచుచున్నది. ఈ తాళమందుఁ బ్రామాణిక

విద్వాంసులచేఁ గృతు లనేకములు వ్రాయఁబడియున్నవి. దీని కాధార మేమైన నుండి యుండవచ్చును. ఈతాళమే పదములు జావళ్లు మొదలగు వానియందు 'అటతాళము' అను పేరుతోఁ దఱచుగ వాడఁబడుచున్నది. ఇందు త్రిశ్రజాతి లఘు వొకటియు, చతురశ్రజాతి లఘు వొకటియు దీని కంగములుగ వాడఁబడుచున్నవి 3 'జుల్వ' అని మఱియొక తాళము వాడు కయందుఁ గనవచ్చుచున్నది. ఇందును మార్గప్రాణవిరుద్ధముగా నొక్క లఘువు మూఁడక్షరముల గతితో నడుచుచున్నది. ఇది మహమ్మదీయుల గానమునుండి వచ్చియుండవచ్చును 4 'మధ్యాది' యని యింకొక తాళము కలదు. దీనికి రెండు అనుద్రుతములు ను, ఒక ద్రుతము ను (◡◡o) అంగములు. దీనినే మహమ్మదీయులు 'ఖ్యాల్ తాళము' అని చెప్పుదురు. 5 'ధ్రువరూపకము' అని వేఱొక తాళము కలదు. రెండు అనుద్రుతములును, రెండు ద్రుతములును (◡◡oo) దీనికి అంగములు. ఇది రూపక తాళప్రస్తారమునుండి పుట్టినది దీనినే మహమ్మదీయులు 'ద్రుపద్ తాళము' అను పేరుతో వాడుదురు

మఱియు నీ సప్తతాళంబులలోని మఠ్యతాళము '1O1' శ్రీకరితాళ మను పేరుతోడను, రూపకతాళము 'O1' నటీతాళమను పేరుతోడను, త్రిపుటతాళము '1OO' నటనీతాళ మను పేరుతోడను అష్టోత్తర శత తాళంబులలోఁ గనవచ్చుచున్నవి జంపెతాళము '1 ◡ O' శృంగారిణీ తాళ మను పేరుతోడ చతుష్పంచాశత్తాళంబులందుఁ గనవచ్చుచున్నది అటతాళము '1 1OO' ప్రతితాళ మను పేరుతోడను, ఏకతాళము '1' ఆదితాళ మను పేరుతోడను నూటొక్క తాళములందు గనవచ్చుచున్నవి. ఈ తాళంబులు వానినుండియే తొలుతఁ జేకొనఁబడెనని తలఁచునెడ నీ తాళంబులే యేల చేకొనఁబడవలయునో వీనికి మాఱుపేరు లేల పెట్టఁబడవలయునో యిందులకుఁ గారణంబు మృగ్యంబు.

## నూటొక్క తాళములు.

సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యము లను తన పంచముఖములవలన నీశ్వరుఁడు నందికేశ్వరునికొఱకు చచ్చుత్పుట,

చాచపుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టిక, ఉద్ఘట్టము లను తాళపంచకమును గలుగఁజేసెననియు, వానిని బిమ్మట లోకోపకారార్థము ఆంజనేయ దత్తిలాదులు విస్తరిల్లఁజేసి నూటొక్క తాళములుగ నొనర్చిరనియు శాస్త్రము చెప్పుచున్నది వాని వివరణ మిచట ననవసరమయ్యుఁ జదువరులకు భ్రాంతి నివృత్యర్థంబుగ వానిలోఁ గొన్ని యిట వివరింపఁబడుచున్నవి.



## నూటొక్క తాళముల లక్షణము

శ్లో ॥ తాళేచఞ్చత్పుటేజ్ఞేయం గురుద్వంద్వం లఘుప్లుతమ్ ॥

1. చఞ్చత్పుటతాళమునకు అంగసంజ్ఞ = 22 | 3 ఇది విషమయతి.

శ్లో ॥ గురు ర్లఘు ర్గురుశ్చైవ భవే చ్చాచపుటాభిదే ॥

2. చాచపుట తాళమునకు అంగసంజ్ఞ = 2 | | 2 ఇది పిపీలికయతి

శ్లో ॥ పలగాగలపాశ్చైవ షట్పితాపుత్రిక స్తథా ॥

3. షట్పితాపుత్రిక తాళము అంగసంజ్ఞ = 3 | 22 | 3 ఇది విషమయతి.

శ్లో ॥ మగణశ్చ ప్లుతాద్యంతం సంపద్వేష్టిక సంజ్ఞకే ॥

4. సంపద్వేష్టిక తాళము = 3 2 2 2 3 ఇది పిపీలికయతి.

శ్లో ॥ ఉద్ఘట్టతాళేక ర్తవ్యం మగణశ్చ ప్రకీర్తితః ॥

5. ఉద్ఘట్టతాళము = 2 2 2 ఇది సమయతి.

శ్లో ॥ ఆదితాళే లఘుస్స్మృతః ॥

6. ఆదితాళమునకు అంగసంజ్ఞ = |

శ్లో ॥ దర్పణశ్చ ద్రుతద్వంద్వం గురుశ్చైకః ప్రకీర్తితః ॥

7. దర్పణతాళము = ౦ ౦ 2 ఇది స్రోతోవహాయతి.

శ్లో ॥ అష్టకృద్వస్తు చర్చర్యాం విరామాంతే ద్రుతౌలఘుః ॥

8 చర్చరితాళము = ౦ 8 | ౦ 8 | ౦ 8 | ౦ 8 | ౦ 8 | ౦ 8 | ౦ 8 | ౦ 8 |

శ్లో ॥ సింహాలీలే విధాతవ్యం లఘ్వాద్యంత ద్రుతత్రయమ్ ॥

9. సింహాలీలతాళము = | ౦ ౦ ౦ | పిపీలికాయతి.

కూడదో, ఆ మహాత్ములు కూడ నేల ప్రస్తరింపఁబడఁగూడదో కారణములు కానరావు ఇవిగాక అష్టోత్తర శతతాళంబులనియు ఏఁబదినాలుగు తాళంబులనియు వెలుగఁ గలవు కావున వీనిని, ఇంకఁ గల్పింపఁబడనున్న వానినికూడఁ బ్రస్తరించి రాగంబులవలెనే తాళంబులును లెక్కకు మీఱి "అనంతావై తాళాః" అనువాక్యము సార్థకమగును.

కాని యా తాళంబులన్నియు వాడుకలో లేవు కావున వాని నిటఁ జూపుటగాని, వాని ప్రస్తారంబుల నిట వివరించుటగాని ప్రస్తుతమం దనవసరమగునని తోఁచుటచే విరమించుటైనది.

## తాళములందలి పాటలు.

ఏ తాళమునందైన నే పాటనైనఁ బాడుకొనుటకుఁ బాడకునకు స్వాతంత్ర్య ముండినను ప్రతితాళమందును ప్రతివిధమగు పాటయుఁ బాడఁబడుట యాచారమందుఁ గనవచ్చుట లేదు అనఁగాఁ గొన్ని తాళములందుఁ గొన్నివిధములగు పాటలు మాత్రమే పాడఁబడుచున్నవి. ఆ వివర మిటఁ దెలుపఁబడును

1. ఆదితాళము —ఇది 35 తాళంబులలోనిది. చతురశ్రజాతి త్రిపుటతాళమునకు నామాంతరము. ప్రతిసంగీతవిద్యార్థికిని ప్రథమమున నీతాళమందే స్వరసాధనము చేయింపఁబడుచున్నది ఆదియందు అనఁగా మొట్టమొదట నేర్పఁబడుటచేతనే దీనికి ఆదితాళ మను పేరు వచ్చెనని యూహింపఁదగియున్నది. వర్ణములు కృతులు లోనగునవి యీతాళమందే యెక్కువగ వ్రాయఁబడియున్నవి ఇది పాడుకొనుటకు విద్యార్థులకును విద్వాంసులకును గూడ మహానుకూలంబుగ నుండును.

2 అటతాళము·— ఖండజాతి అటతాళమునం దొక్క తానవర్ణములు మాత్రము చాలఁ వ్రాయఁబడియున్నవి. కొన్ని గీతములును గలవు ఈ తాళముయొక్క యీ జాతియందుఁ గాని మఱే యేజాతియందుఁ గాని కృతులు, పదములు లోనగునవి రచియింపఁబడి యున్నట్టులు కానరావు.

3. రూపకతాళము.—చతురశ్రజాతి రూపకతాళమునందుఁ గృతులు విస్తారముగను, గీతములు కొంచెముగను వ్రాయఁబడియున్నవి. కృతులవలెనే పదములును జావళ్లును గూడఁ గలవు కాని దీనియందు తానవర్ణములు రచింపఁబడినట్టులు కానరాదు

4 త్రిపుటతాళము:—దీని చతురశ్రజాతిరూపము ఆదితాళంబుగ ముందే వివరింపఁబడినదికదా. ఇఁక దీని త్రిశ్రజాతియందు గీతములును గృతులును, పదములును, కొన్ని రచింపఁ బడియున్నవి. వర్ణములు మాత్రము రచింపఁబడినట్లు కనరాదు

5. ధ్రువతాళము —చతురశ్రజాతి ధ్రువతాళమునందుఁ గొన్ని గీతములు రచింపఁబడియున్నవి. కాని యిందు వర్ణములు, కృతులు, పదములు లోనగునవి కానరావు

6 మఠ్యతాళము —దీని చతురశ్రజాతియందుఁ గొన్ని గీతములు మాత్రము కానవచ్చుచున్నవి.

7 జంపెతాళము —మిశ్రజాతి జంపెతాళమందు గీతములును గృతులును నెక్కడనోయొకటిగ మాత్రము కానవచ్చును.

ఈ పైఁజెప్పఁబడిన తాళములందు వానిచెంత నుదాహరింపఁబడిన జాతులలో వినా యితరజాతులలోఁ గృతులు వర్ణములు లోనగునవి రచింపఁబడె ననుట కాధారము లెంతమాత్రము లేవని గ్రహింపవలయును

## పాటలందలి తాళములు.

కొన్ని తాళములందుఁ గొన్నివిధముల పాటలుమాత్రమే పాడఁబడినట్టులు, కొన్ని విధముల పాటలయందుఁ గొన్నితాళములుమాత్రమే వాడఁబడుచున్నవి. అవి యిటుఁ దెలుపఁబడును.

1. గీతములు.— వీనియందు ధ్రువతాళంబును రూపకతాళంబును త్రిపుటతాళంబును దఱచుగను, ఆది అట ఏక జంపె మఠ్యతాళంబులు సకృత్తుగను వాడఁబడియున్నవి.

2 తానవర్ణములు:— వీనియందు ఆదితాళంబును ఖండజాతి అటతాళంబును మాత్రమే వాడఁబడియున్నవి. జంపెతాళము మిక్కిలి సకృత్తుగఁ గలదు.

3. కృతులు:— వీనియందు ఆదితాళ రూపక తాళంబులు తఱచుగను చాపుతాళము కొంచెముగను జంపె, త్రిపుట, ఏక తాళంబులు సకృత్తుగను వాడఁబడియున్నవి.

4. పదములు:— వీనియందు ఆది, అట, త్రిపుట, రూపకతాళంబులు తఱచుగను జంపె, ఏకతాళంబులు అరుదుగను వాడఁబడియున్నవి. ఈ అటతాళంబునకు చాపుతాళమనియే అర్థము.

5. పల్లవి:— వీనియందు పాటకుని యిచ్ఛను సమర్థతను బట్టి యేతాళమైనను వాడఁబడుచున్నది.

## ఉపన్యాససారము

సప్తతాళంబులును, ముప్పదియైదుతాళంబులును, నూటొక్క తాళంబులును, నూటయెనిమిదితాళంబులును, ఏఁబదినాలుగుతాళంబులును, మఱియుఁ బ్రస్తరింపఁబడనున్నతాళంబులును నసంఖ్యాకంబులుగ నెన్నో కలవని వచించినందులకుఁ దుద కేమి తేలినది చూడుఁడు. ఆది,అట, రూపకము,త్రిపుట తాళములు మాత్రము పెద్దలచేఁ దఱచుగ వాడఁబడెననియు ధ్రువ, మఠ్య, జంపె, ఏక తాళములు మిక్కిలి యరుదుగ వాడఁబడెననియు సారము తేలుచున్నది. కావున 'అనంతావై తాళాః' అనునట్లు తాళములు లెక్కలేనన్నియుండినను విద్యార్థులు ఈ సంఖ్యాబాహుళ్యముం గాంచి వెఱఁగందక ప్రారంభమున ముఖ్యమగు నాలుగు తాళంబుల మాత్ర మభ్యసించినఁ జాలును అనంతరము మఱికొన్ని తాళంబు లతిసులభంబుగ నప్రయత్నపూర్వకంబుగ నలవడును

గీ తొలుతఁ దాళంబు లెటుగలెఁ • దెలియరాదు
జన్యము లవెన్ని? యనఁగ నే • సరణిఁ దెలియు
ముఖ్యముగ నాల్గు తాళముల్ • ముందు గొనిన
గానకార్యంబు ముప్పావు • గడచు సరిగ.

## 10. అవధానములు.

### పీఠిక.

ఈ యాంధ్రదేశంబునఁ గొందఱు కవిపుంగవులు తమ యసమానమైన యాశుకల్పనాసామర్థ్యంబును, ధారణాకౌశలంబును జూపుచు అష్టావధానం బొనర్చి, తత్సమయంబున నేకకాలంబున నెనిమిది వివిధములగు కార్యముల నొనరించి ప్రజల మనంబుల నెక్కుడుగ రంజిల్లఁజేయుచుండిరి దీనిచేతఁ బ్రజ లట్టి యష్టావధానములయందే గాక యా యష్టావధానమనెడి నామమునందుఁ గూడఁ గొంత గౌరవమును గలిగి యుండిరి. దానం జేసి కొందఱు గాయకులు తాము సంగీతమం దష్టావధాన మొనరింతు మని సభలయం దీ సప్తతాళముల జాతిభేదములఁ గైకొని కొన్ని కార్యంబు లొనరించుచుండిరి. ఆ విశేషంబులు చదువరులకు వినోదజనకంబులుగను, సంగీతవిద్యార్థుల కాశ్చర్యకరంబులుగను ఉండునని కన్పట్టుటచే ఆ యష్టావధానవిధానం బొకటియే కాక పంచావధానము మొదలు చతుర్దశావధానమువఱకు వయసను పది యవధానంబు లిట్లు వివరింపఁబడు చున్నవి. కతినమనక నీసిని జదువరులు సావధానచిత్తమునఁ జిత్తగింతురుగాక.

## 11. సంగీతాష్టావధానము.

అవధాన మనఁగా నెచ్చరిక, జాగరూకత. అష్టావధాన మనఁగా వివిధములగు నెనిమిది పనులయం దేకకాలమున మనస్సు నుంచి వానిని జాగరూకతతో నెఱవేర్చుట. కొంతమందికి (సుమారు రెనమంచుగురికి) కవిత్వము చెప్పుట నొకపనిగాఁ గైకొని యనంతరము వ్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి, చేదరంగమాడుట, పూవులనుగాని గంటలనుగాని యెంచుట, సంగీతము పాడుట, పురాణము చెప్పుట, మొదలగు నేవియైన మఱి యేడుపనులను గైకొని కవివరు లష్టావధాన మొనరింతురు. అందుల కీ గాయకుఁడు చెప్పున దేమనఁగా:—"అయ్యా! మీర లెనిమిదిమంది యెనిమిది వేఱువేఱగు తాళములను వేయుచుండఁగా నేను ఆ యెనిమిదితాళముల నొక్కసారిగ నవలంబించి పాడుటయే గాక యా యెనిమిదితాళములకు నొక్కసారిగ

నావర్తముచివరకు వచ్చునట్లు ముక్తాయించి, లేక స్వరమును దీర్ఘ మెనిమిదితాళములకు నొక్కసారి యావర్తారంభమునకు వచ్చునట్లు పల్లవినెత్తెదను జూడుడు" అని సభాసదులకు విన్నవించును. సాధారణముగఁ బాఠకులు తమకుఁదామే వేసికొనుచుఁ బాడిన యొక్కతాళమునందే తప్పితప్పె నని పలుసార్లు జగడమాడుకొనుచుండఁగా నితరు లెనిమిది మంది వేసెడి వేఱువేఱుతాళములకు సరిపోవునట్లు వీరు పాడుదురనుట చేత సభికు లెల్లరు మిక్కిలి యాశ్చర్యమునొంది యీ గాయకులు సామాన్యమనుష్యమాత్రులు గారని తలఁచుచుందురు. ఈ గాయకుఁడును ఆ యెనమండుగురికి నెనిమిది తాళములను దానే నియమించి యా తాళములకు సరిపోవునట్లు పాడును. వారలు మిక్కిలిగ నానందించి యీ గాయకుని గొనియాడుదురు.

## అష్టావధానరహస్యము.

ఈ యష్టావధానము కవివరులొనరించు నట్టి యష్టావధానమువలె బహుప్రయత్నసాధ్య మగునది కాదు. మిక్కిలి సులభమయినది. కవివరుల యష్టావధానము సర్కసులోని కసరతువంటిది. ఎంతగనో ప్రయత్నించినఁ గాని కొంతయైనఁ గొంతమందికైన సాధ్యముకాదు. ఈ గాయకులఁ డొనరించెడి యష్టావధానము గారడివానిచేతిలోని రూపాయవంటిది. దీని రహస్యమును జెప్పినయెడ నప్పుడే రెండవయాతఁ డొనరింపవచ్చును. దీని రహస్యము నిటఁ దెల్పినచో దీని గ్రహించి సంగీతవిద్యార్థు లెల్లరు నొనరింపవచ్చును. కావున నట్టి రహస్య మిచట వెల్లడింపఁబడుచున్నది: దీనిఁ జదువునపుడు 35 తాళముల పట్టికను మాత్రము తఱచుగఁ జూచి యన్వయించు కొనుచుండుఁడు.

అనంతర మిట్టి యవధానముల నొనర్పవలయుననెడి కుతూహలము మీకుఁ గలిగెనేని సప్తతాళములను వాని యంగములను వానినుండి లఘువుయొక్క జాతిభేదముచేఁ గలిగిన 35 తాళముల పేర్లను జక్కఁగఁ జదివి కంఠపాఠముచేసి పెట్టుకొనుడు. అపు డవధానము మీకు మిగుల సులభముగ నుండును.

రహస్యము:—సుధతాళమునకు 3 అక్షరములుకదా. కదంబతాళమునకు 6 అక్షరములుకదా. ఈ రెండుతాళములను జెఱియొకరు వేయుచుండినచో కదంబతాళ మొక యావర్తము పూర్తియగునప్పటికి సుధతాళము రెండావర్తములు తిరిగిరాదా? పత్తితాళమునకును కదంబతాళమునకును దాళాంగములందుమాత్రమే భేదముకలదు గాని యక్షరసంఖ్య రెంటికిని 6 గానే యుండునుగదా. కావున కదంబతాళ మొక యావర్తము తిరిగివచ్చునప్పటికి పత్తితాళమును నొక యావర్తము తిరిగిరాదా? ఉదయతాళమునకు 12 అక్షరములుకదా. ఈ తాళ మొక యావర్తము తిరిగివచ్చునప్పటికి పత్తి, కదంబ తాళములు రెండేసియావర్తములును సుధతాళము 4 ఆవర్తములును దిరిగిరావా? కర అను తాళమునకును ఉదయతాళమునకును దాళాంగములే భేదించునుగాని యక్షరసంఖ్య 12 మాత్రమేకదా. కావున దానిఁగూడ వీనితోఁ జేర్చుకొనరాదా? ఇంతవఱకైదుతాళంబు లయ్యెఁగదా. ఇక్కడ లేశమాత్రపు గురుమంత్రంబొక్కటి కలదు. అదియేమనఁగా- ఈయష్టావధానావసరమును బట్టి, పైముప్పదియైదు తాళములతో నెంతమాత్రమును సంబంధములేని 24 అక్షరములుగ్గల యొక యబద్ధపుతాళమును గల్పించి మీ మనస్సునఁ బెట్టుకొనుఁడు. దాని ననుసరించి పాడుఁడు. దానిలో నీ పైఁ జెప్పిన తాళములయిదును శేషములేకయే తిరిగివచ్చునుకదా. పైఁగా ఆది, సార, చణ తాళములకు అంగభేదముండినను వాని కెనిమిదేసియక్షరములే కలవు కావున నీ యిరువదినాలు గక్షరములలో నా మూఁడుతాళములుగూడ నొక్కొక్కటి మూఁడేసి యావర్తములు తిరిగిరావా?

ఇపుడు చూడుఁడు. మీరు రహస్యముగా నేర్పఱచుకొనిన 24 అక్షరముల యబద్ధపుతాళము ననుసరించి మీరు నిశ్చింతగాఁ బాడుకొనుఁడు. మీ రహస్యతాళమున కావర్తాంతి నగునప్పటికి సుధతాళము 8 ఆవర్తములు పూర్తిగాఁ దిరిగివచ్చును. పత్తి కదంబతాళములు నాలుగేసి యావర్తములును, ఉదయ, కర తాళంబులు రెండేసి యావర్తములును, ఆది,సార, చణతాళంబులు మూఁడేసి యావర్తములును బూర్తిగఁ

దిరిగివచ్చును. మీ రహస్యతాళాంతమునకు సరిగా ముక్తాయించిన యెడ నీ యెనిమిదితాళములకు నపుడే యావర్తాంత మగునుగనుక నీ ముక్తాయింపే యన్నితాళములకు నొక్కసారిగఁ దానియంతట నదే సరిపోవును. మీ రహస్యతాళమునకు 24 అక్షరములను బూర్తిచేసి 25 వ యక్షరముపైనఁ బల్లవి నెత్తఁగానే అ యెనిమిదితాళములకును నేక కాలమం దప్పుడే యావర్తములు ప్రారంభమగును. దానిఁ గాంచి సభికులెల్లరు మహాశ్చర్యము నంది చేతులు తట్టుచు మిక్కిలిగ నానందింతురు. ఇంతటివా రిఁక లేరనుచుందురు.

ఇందు మీ కేమికష్టము కలదు. ఏకష్టమైన నెదుటఁ గూరుచుండి తాళమువేసెడి యెనమండ్రదే అయియున్నది. వారిలోఁ బ్రతివారును దలయెత్తక యొకరిముఖము నొకరు చూడక తమతాళమునే చూచుకొనుచు వేసిరేని తప్పకుండ వేయుదురు ఏ మాత్రమైన నెదుటివాని తాళమును జూచిరేని యా తాళముల కన్నిటికి నంగభేదము కలదుగనుక దమ తాళము తప్పిపోవును. "గాయకుఁడుగా రెనిమిదితాళములకు సరిపోవునట్లు పాడుచుండఁగా నీయన యొక్కతాళమునే వేసికొనలేక తప్పఁగొట్టుకొనెను" అని పదిమందియు నాతనిఁ జూచి గేలిసేయుదురు. ఒకవేళఁ దప్పకయుండునట్లు జాగ్రత్తతో వేసినను ఒక్కతాళమును వేయుటకే యీయన మిక్కిలి శ్రమపడి రనియైన నందురు. సాధారణముగా నెంతటివానికైన నీ పరాభవము తప్పదు. మఱియు "ఇంత కష్టములైన తాళములను వీరలకుఁ బెట్టి యమానుషప్రజ్ఞాధురంధరులగు గాయకుఁడుగా రనాయాసముగఁ బాడిరి" అని సభికులు మెచ్చుచుందురు. ఇదియే సంగీతాష్టావధానము.

క. అష్టావధానమనఁగా
గష్టంబిది కాదు గాన ♦ కార్యములందున్ ;
ముష్టినొక మర్త్యతాళము
వేష్టించినఁ జాలు వేఱు ♦ విద్య వలయునే ?

(ముష్టిన్ =పిడికిటియందు, వేష్టించినన్ =దయచేసి యుండినయెడ.)

## 12. వివిధావధానములు.

పైని వివరింపఁబడిన యష్టావధానవిధానవివరణము వలన నేమి తెలిసెను? గాయకుఁడు ఒక్కమర్మతాళమును దాను స్వయముగఁ గుదుర్చుకొనియో యితరులవలన నేర్చుకొనియో యుండి దానిని సభాముఖంబున నుపయోగించి తాను మాత్రము జాగరూకతతో బాడినం జాలునని కదా తెలిసెను.

ఇచట మఱియొక్క మర్మమును గూడ జ్ఞప్తియం దుంచుకొనుఁడు. మీ రేర్పఱచుకొనిన మర్మతాళాంతమునకు సరిపోవునట్టులు పల్లవిని బాడి స్వరముగాని, కొంత స్వరమును బాడినవెనుక ముక్తాయినిగాని తీర్పఁగలిగినచో నట్టులు తత్సమయమందే సమర్థింపుఁడు. లేనియెడ నట్టి పల్లవిని, స్వరమును, ముక్తాయింపును గూడ నింటియొద్దనే కుదుర్చుకొని, కట్టుచేసికొని, పారముచేసి, దానిని సభాముఖంబునఁ బ్రయోగింపుఁడు. అదియుఁ గానిచో నా యావర్తాంతమునకు సరిపోవునంతటి పొడుగుఁ గల యొక కీర్తనను వ్రాసికొని పారముచేయుఁడు. మీకుఁ గవనసామర్థ్యము లేనిచో సంగీతసాహిత్యవిద్యాపరిచితిఁ గల యే కవిచేతనైన నొక్క పాటను వ్రాయించి పారముచేసి భద్రముగఁ బెట్టుకొనుఁడు. మీ మర్మతాళావర్తము పెద్దదిగనుండె నని వెఱపు తోఁచెనేని దానిని రెండు మూఁడావర్తములుగాఁ జేసికొనుఁడు. 21 అక్షరములను మూఁడు శంఖతాళములుగ విభజింపవచ్చును. 24 అక్షరములను మూఁడు ఆదితాళములుగఁ గాని రెండు లేఖతాళములుగఁ గాని విభజింపవచ్చును. ఇంక మీ కేమిశ్రమ కలదు? ఇంటికన్న గుడి పదిలమయ్యె ననిన ట్లాయెఁగదా. కావున ని ట్లొనర్పుఁడు.

ఇట్లు వివిధావధానముల నొనర్చుటకు మీ కేమికావలసియున్నది? ఒక్కొక్క యవధానము, దానికి వలయు మర్మతాళము, ఆ తాళమునందు శేషము లేక యావర్తింపఁదగిన యితరతాళములు గదా మీకుఁ గావలయును. అవియే యిట వివరింపఁబడుచున్నవి.

## వివిధావధానముల పధకము.

| అవధాన నామములు. | మర్గతాళముల అక్షరసంఖ్య | ఇంకఁ జేరెడి యితర తాళములు. |
|---|---|---|
| 1. పంచావధానము | 21 | మధుర, శంఖ, సుధ, రాగ, రాజ. |
| 2. షడవధానము | 28 | శ్రీకర,మధుర,శంఖ, రాగ,రాజ, విదళ. |
| 3. సప్తావధానము | 20 | సమ, మాన,చక్ర, గుప్త, సుర, రత,రావ. |
| 4. అష్టావధానము | 24 | పత్త్రి, ఆది, సార, కదంబ, సుధ, ఉదయ, చణ, కర. |
| 5. నవావధానము | 42 | శ్రీకర, పత్త్రి. మధుర, కదంబ, శంఖ, [సుధ,రాగ,రాజ,విదళ. |
| 6. దశావధానము | 36 | పత్త్రి, లేఖ, మాన, కదంబ, సుధ, కుల, ఉదయ, దుష్కర, కర,వసు.(అష్టావధానమునకు లేఖ మానతాళముల జేర్చినను చాలును.) |
| 7. ఏకాదశావధానము | 48 | పత్త్రి, ఆది, లేఖ, మాన, సార, కదంబ, సుధ, ఉదీర్ణ, ఉదయ, చణ, కర. |
| 8. ద్వాదశావధానము | 72 | పత్త్రి,ఆది,లేఖ, మాన, సార, కదంబ,సుధ,ఉదయ,చణ, దుష్కర,కర,వసు. |
| 9. త్రయోదశావధానము | 84 | శ్రీకర, పత్త్రి, మధుర, లేఖ, మాన, కదంబ, శంఖ, సుధ, రాగ,ఉదయ, రాజ, విదళ, కర. (ద్వాదశావధానమునకు లోయతాళమును జేర్చినను జాలును |
| 10. చతుర్దశావధానము | 120 | సమ, పత్త్రి, ఆది, లేఖ, సార,చక్ర,కదంబ, గుప్త, సుర, ఉదయ, చణ, రత, రావ,కర. (వీనియందు మాన, సుధ తాళములఁ జేర్చుకొని 15 గాని 16 గాని చేసికొనవచ్చును.) |

ఈ యవధానములలో పంచావధానము అనుటచేత 5 తాళముల యవధానమనియు నవావధానము అనుటచేత 9 తాళముల యవధానమనియు నిట్లే ప్రతినామమందలిసంఖ్యచేతను ఆ యా యవధానములం దన్ని తాళములు కలవని తెలియుచుండెంగదా. ఆ తాళములలో విషయబోధనముకొఱకు మాత్రము సమయానుకూలముగఁ గొన్ని యిట వివరింపఁబడినవి. కాని పంచావధానమనుటచేత నిచటఁ జెప్పఁబడిన యైదుతాళములే యెల్లప్పుడు నందు రావలయు నని మాత్రము తలఁపఁగూడదు. మఱి యేతాళములనైన నందుఁ జేర్చుకొనవచ్చును. వానికిఁ దగిన మఱి తాళమును మాత్రము జాగరూకతతో వేఱుగఁ గుదుర్చుకొనవలయు. లేనియెడ షడవధానమునుండి యొక్క తాళమును దీసివేసినచో పంచావధానమే యగును. అష్టావధానమునుండి రెండుతాళములఁ దీసివేసినయెడ షడవధానం బగును. ఏయవధానమునైన నిట్టులే మార్చుకొనవచ్చును. అప్పటి కెందఱు తాళములువేయఁగలవారు దొరికిన నందఱితోడనే యవధానమును జేయవచ్చును. కాని చేసినవిధముననే చేయుచునుండక తాళములను మార్చిమార్చి చేయుచుండుట నాశయమని వేఱుగఁ జెప్ప నక్కఱయుండదుగదా. కావున వివిధమార్గముల నేర్చియుండవలయు.

## అవధానవిమర్శనము.

అవధానమనుటచేత వివిధములగు కార్యములం దేకకాలమున మనసు నుంచి వానిని నెఱవేర్చుట యని ప్రజలు గ్రహించుచున్నారు. కాని దీనియందు గాయకుని మనస్సున వివిధవిషయధారణము సుంతయును లేదు. కావున దీని నవధానమని చెప్పుటకు వీలులేదు. ఇది యవధానమును గాదు, దీనిఁ జేయునాతఁడు అవధాయకుఁడును గాఁడు. కవివరులొనరించు నవధానములందుఁ బ్రజలకు గౌరవముండుటచేత నా యవధాననామమును వీరలు చేకొనిరి. ఈ వివిధావధానముల నేర్పుటచేతఁ బ్రజలను భ్రమపెట్టుటయే పర్యవసానమగును. కాని యిందు గాయకుని సమర్థతలేశమును లేదు. గాయకుఁడు కొన్నిసమయములందు ఆ మఱి

తాళమునుగూడ స్వయముగఁ గల్పించుకొనఁజాలియుండఁడు. వినువారలకు దీనివలనఁ బుణ్యము పురుషార్థ మేమియుఁ గానరాదు. ఒకరొకరే తాళముతప్పుచుండుటయు నందఱును మరల మొదలిడుచుండుటయుఁ గలుగుచుండును కావున గానమువలని తాత్కాలికానందమైనఁ గలుగదు. పలువురు భ్రమించి వారకుఁడు గట్టివాఁడు గట్టివాఁడని యనుకొను పల్కులను వినుటమాత్రమే నాఁటి సంగీత మగును.

మఱియు గానామృతసారమును కొల్లగ వెదచల్లి యెల్లరి నానందసాగరంబున నోలలాడించునాతఁడు విద్వాంసుఁడనంబడును ఇట్టి యవధానంబులు కేవలము గారడిపనులుమాత్రమే యగును. కావునఁ బ్రజలు దీని నొక వినోదముగఁ బెట్టుకొనినఁ బెట్టుకొందురుగాక. కాని యీ సంగీతావధానముల నొనర్చెడు గాయకులు గట్టివారనియుఁ దదితర గాయకులు సామాన్యులనియు మాత్రము భ్రమఁజెందక గానముయొక్క మార్దవమును రసమును గ్రహించి యానందించుట యుత్తమకార్యమగును.

క. వివిధావధానముల నే
నవలీలగఁ జేయనేర్తు నని వెడలినచో
భువిఁ గొందఱైన నతనికి
నవలీలను వశులుగారె యంతియ చాలున్.

## 14. పల్లవిపాట యన నేమి ?

పల్లవిపాట గీతవర్ణ కృతి విలక్షణమైన గానమార్గము నవలంబించుచున్నది. ఆ గీతవర్ణకృతుల లక్షణముల నెఱిఁగినఁ గాని తద్విలక్షణముల నెఱిఁగించుట కలవికాదు. కావున నట్టి గీతవర్ణకృతుల లక్షణములును, వానిఁ బాడు మార్గములును సంగ్రహముగ నిట వివరింపఁబడుచున్నవి.

### గీతములు

విద్యార్థికిఁ బ్రారంభమందు సరళి స్వరము మొదలు అలంకారములయంతము వఱకుఁ గల స్వరములన్నియు నొక మాయామాళవ గౌళ

రాగమునందు సాధనము చేయింపఁబడుచున్నది. ఇంతవఱ కాతనికి రాగ కల్పన యన నేమో తెలియదు. కాని అలంకారములందు సప్తతాళములు మాత్రము నేర్పఁబడును. ఇఁక విద్యార్థికి రాగాలాపము గీతములతోనే ప్రారంభము చేయఁబడును. కావున విద్యార్థికి సులభముగ నలవడుటకై చిన్నవిగ నుండునట్లును, రాగముయొక్క ఆరోహణావరోహణాదులు విరళముగఁ దెలియునట్లును, విళంబకాలమునందే మిక్కిలిగ నడచునట్లును, శబ్దములనడుమఁ దఱచుగ రెండుమూఁడక్షరముల తానము మాత్రమే వచ్చునట్లును గీతములు వ్రాయఁబడినవి. వానిలోఁ గొన్నిటి సాహిత్యమందు ఆయా రాగముల లక్షణము వ్రాయఁబడినది. ఇట్టివి లక్షణగీతము లని చెప్పఁబడుచున్నవి. మఱియు నీ గీతములందు 1. ఉద్గ్రాహఖండము, 2. ఆభోగఖండము, 3. ముద్రాఖండము అని మూఁడు భాగములు కలవు. వాని వివరణ మిట ననవసరము.

## తానవర్ణములు.

తానవర్ణములందు పల్లవి అనుపల్లవి చరణము అని మూఁడు భాగములు కలవు. అనుపల్లవికి ఉపపల్లవి యనియు నామాంతరము కలదు. ఈ మూఁడును తానప్రధానములయియే యుండును. ఇందుఁ బూర్వముఁ జెప్పఁబడిన దశవిధగమకములును, చతుర్విధకల్పనలును కవిచే సమర్థముగఁ బ్రయోగింపఁబడి యుండును. కాని యొక్క పదముపై నొక్కటి ద్వో అంతకన్న నెక్కువగో గమకము లొక్కసారి ప్రయోగింపఁబడినపుడు దానిని మరలమరల నెన్నిసారులు పాడినను అవేగమకములు లేశమాత్రమును భేదములేక యుండునట్లు ప్రయోగింపఁబడవలయు. కాని కొందఱు పాటకులు కొన్ని స్వరములందుఁ గొన్ని స్థలములలోఁ గవికల్పితగమకములకు బదులుగా స్వకపోలకల్పితగమకములఁ గూర్చి ప్రయోగించుచున్నారు. అయినను శాస్త్రక్రమము ననుసరించువా రెవ్వరును లేక యుండిరి? ఎన్ని నియమములు గల కవిప్రయోగితగమకములైన నూతన గ్రంథములందుఁ గనవచ్చుచున్నవి! అట్టి బాల్యవివాహదోషములు సంఘమం దెన్ని కనవచ్చుటలేదు!

ఈ తానవర్ణముల చరణము ననుసరించి సుమారు 3, 4, 5, చిట్ట స్వరములు వ్రాయఁబడి యుండును. ఇవి విద్యార్థికి ముందుముందు స్వకీయముగు స్వరకల్పనాసామర్థ్యమును గలిగించుట కుపయోగించును

## కృతులు.

కృతులయందును పల్లవి, అనుపల్లవి, చరణము అను మూఁడు భాగములు కలవు. తానవర్ణములందుఁ గాని కృతులయందుఁ గాని పల్లవియు ననుపల్లవియుఁ గొలతయందు సమంబుగనే యుండును. అనఁగాఁ బల్లవి యర్ధావర్తమే యుండినచో ననుపల్లవియు నర్ధావర్తమే యుండును. పల్లవి యొకయావర్తి ముండినచో ననుపల్లవియు నొకయావర్తమే యుండును. పల్లవి రెండావర్తములున్నచో ననుపల్లవియు రెండావర్తము లుండును సాధారణముగాఁ బల్లవి యనుపల్లవులు రెండావర్తము లుంట కనవచ్చుచున్నది. చరణము తానవర్ణములం దొక్కటికన్న నెక్కుడెక్కడను గనరాదు. కృతులందుఁ గొందఱొక్కచరణంబును మఱికొందఱు మూఁడుచరణంబులను వ్రాసిరి. అందు గురుమూర్తిదీక్షితులవా రొక్క చరణంబునే వ్రాసిరి శ్యామశాస్త్రులవారు మూఁడేసిచరణముల వ్రాసిరి తాగయ్యగారు కొన్నిటి కొక్కచరణంబును మఱికొన్నిటికి మూఁడు చరణంబులను వ్రాసిరి. తక్కినవారు వీరిలో నొకరిమార్గంబు నవలంబించిరి. ఎచ్చటనో యొకటిరెండు కృతులకు రెండేసి చరణంబులును వ్రాయఁబడినట్లులు తెలియుచున్నది అనంతరకవులు కీర్తనల వ్రాయునపుడు వీరి పద్ధతులనే యవలంబించిరి కాని కొన్నిచరిత్రలను కీర్తనరూపముగ్గ వ్రాయునపుడు మాత్రము అవసరమగునన్ని చరణములను వ్రాసిరి.

ఈ కృతులయందు వీని కలంకారప్రాయములగు సంగతులు కలవు స్వరముతోడఁ గాని సాహిత్యముతోడఁ గాని చేర్పఁబడక అర్థవిహీనమైన కేవలధ్వనితోడఁ బ్రయోగింపఁబడిన గమకములకు 'సంగతి' యను పేరు సంగీతవిద్వాంసు లెల్లరచే వాడఁబడుచున్నది ఏలయో నిఘంటువులం దీ యర్థము చేర్పఁబడలేదు. ఈ సంగతులు ప్రతికృతియందు నుండును. ఇవి మిక్కిలిగ సర్వజనరంజకములై యుండును. ఈ సంగతులను

స్వయముగఁ బ్రయోగించు శక్తిని సంపాదించుటే సంగీతవిద్యార్థు లొనరించు బహువిధపారముల పర్యవసాన మగుచున్నది. ఈ సంగతులఁ బ్రయోగించు శక్తియే విద్యార్థి శ్రమపడి తన హృదయభూమియందు నాటుకొనిన సంగీతవృక్ష మొసంగు ఫలము ఈ సంగతులు కృతులందుఁ బెక్కులుగఁ బ్రయోగింపఁబడును. వీనికి సంఖ్యానియమము లేదు. ఎన్నియైన నుండవచ్చును. కాని యీ సంగతులు తాళదశప్రాణబద్ధములై, రాగస్వర వర్జ వక్రాది నియమసహితములై, దశవిధ గమకరూపాలంకారయుతములై, కృతిగర్భితాభిప్రాయానుగుణములై, నవనవోత్సాహ కల్పనాచాతురీభరితములై యుండవలయు. ఇట్టి సంగతులఁ గూర్చుట యెల్లరకును సామాన్యముగ నలవి కాదు కావున దీని నెఱిఁగి యా కృతికర్తలు తాము సంగీతసాహిత్యవిద్యాధురీణు లగుటం జేసి తమ లులవసే లోకోపకారార్థ మా కృతులందుఁ దత్తద్భావోచితము లగు సంగతులు నియమసహితములగునట్టులు తామే రచించి వానిని విద్యార్థులకొఱకు స్వరపఱిచి యుంచిరి.

ఇచ్చట స్వరపఱచుట యన నేమో కొంచెము వివరింపవలసి యున్నది. అందులకుఁ జదువరులు మన్నింతురుగాక. భావాభిప్రాయములఁ దెల్పుటకు లేఖనాక్షరము లెట్లో సంగీతాభిప్రాయములఁ దెల్పుటకు స్వరాక్షరము లట్లు. ఎదుట లేనివారికి భావాభిప్రాయముల నక్షరములతోడ వ్రాసి యెట్లు తెలియఁబఱుతురో సంగీతాభిప్రాయముల స్వరాక్షరములతోడ వ్రాసి యట్లు తెలుపనగును చదువనేర్చినవా రుత్తరములఁ జదువరులచేఁ జదివించి భావముల నెట్టులు గ్రహింతురో స్వరపరిచితి లేని గాయకులు స్వరపరిచితిఁ గలవారిచే వానిఁ జదివించుకొని పాట నట్లు గ్రహింపనగును. భావమును గ్రహించిన వెనుక జాబుతో నవసర మెట్టులు తీఱిపోవునో పాటను గ్రహించిన వెనుక స్వరముతో నవసర మట్టులు తీఱిపోవును. కావున పాట నుపయోగమునకుంచుకొని స్వరమును జ్ఞాపకార్థము దాఁచిపెట్టుకొందురు. ఇట్లు తన హృదయమందలి సంగీతభావములను స్వరాక్షరములతో వ్రాయుటయే 'స్వరపఱచుట' యనఁబడును.

ఇట్లు స్వరపఱుపఁబడిన సంగతులుగల కృతు లిపుడు వెక్కులు ముద్రితములై సంగీతగ్రంథముల కలంకారములై యున్నవి. ఈ సంగతుల సంఖ్య పల్లవియం దెక్కువగను, అనుపల్లవియందుఁ గొంచెము తక్కువగను, చరణమునం దంతకంటెఁ గొంచెము తక్కువగను ఉండును. ఎట్లయినను పల్లవికంటె ననుపల్లవియం దెక్కుడుగఁ గాని యనుపల్లవికంటెఁ జరణమునం దెక్కుడుగఁ గాని యుండుట కానరాదు.

కొన్ని కృతులకు రెండుగాని నాలుగుగాని యావర్తముల స్వరము వ్రాయఁబడియున్నది కత్తి, బాకు మొదలగు నాయుధములు శరీరమున కలంకారప్రాయము లయినట్టులు ఈ సాధనమయిన స్వరమును గృతుల కలంకారప్రాయమగుటయ గాక యీ రాగముల వర్జ్యవక్రస్వరగతుల నెఱిఁగించుటకుఁ బ్రత్యేకసాధన మగుచున్నది కొందఱ స్వరమునకు సాహిత్యమునుఁ గూడ వ్రాయుచున్నారు

పల్లవి.

పైఁజెప్పఁబడిన గీతవర్ణకృతుల లక్షణములచేఁ బల్లవిలక్షణమిపుడు సిద్ధాంతపఱుపఁబడవలసియున్నది ఎట్లనఁగా, గీతమునందువలెనే దీనియందు గానము కలదుగాని యీ గానము మఱియొకరిచేఁ జిట్టగా వ్రాయఁబడి యుండదు. తానవర్ణమునందువలెనే దీనియందు తానమును కల్పనస్వరములును ఉండునుగాని యివి యితరులచే వ్రాయఁబడియుండవు. కృతులందువలెనే దీనియందు సంగతులసంఖ్యాకములై యుండును గాని యివి యితరులచేఁ జిట్టలుగా వ్రాయఁబడియుండవు. పల్లవి పాడుటకుఁ బూర్వము ఆ పల్లవియొక్క రాగమును గాయకుఁడు విశ్రాంతిగఁ బాడవలసియున్నాఁడు ఈ రాగాలాపము అనునది పల్లవి యను పదమందుఁ జేరకపోయినను ఇది విద్వత్కోటిలో నాచారమునందు మిక్కిలిగఁ గనవచ్చుచున్నది ఇది యవసరము కూడ నైయున్నది. ఈ రాగాలాపమును ఈ పల్లవియందలి గానక్రమమును, తానమును, స్వరసంచారమును, సంగతులను విద్వాంసుఁడు స్వశక్తిచేతఁ గల్పించి పాడవలసియున్నాఁడు. దీనియం దనుపల్లవియుఁ జరణంబులు నుండవు. ఇట్టిదే 'పల్లవిపాట'.

ఉ. పల్లవిమాత్ర మెత్తి, యను ♦ పల్లవియుం జరణంబులేక, యం
దల్లెడ రాగసంగతు ల ♦ హీనగతిన్ స్వరకల్పనంబు రం
జిల్లఁగఁ, దొంటిపద్ధతిని ♦ జిట్టలతోఁ బని లేక, యంతయుం
గొల్లగ నాశుధార నొన ♦ గూర్చు నె పల్లవిపాట నాఁబడున్.

## 15. పల్లవిపాట యెందుకు?

గీతములను, తానవర్ణములను, కృతులను బాడునపుడు పాటకుని సమర్థత చక్కఁగా సభ్యులకు వెల్లడికానేరదు. ఏలయన, వానియందలి గానాధిక్య మంతయుఁ గవికల్పితమే వానిం జక్కఁగఁ బఠించి యొప్పగించుట మాత్రమే పాటకుని పని. "మావి మాకిచ్చుట మడిమాన్యంబు లిచ్చుట" యనినట్టులు తాను వానిం జెడఁగొట్టకుండ నొప్పగించినయెడఁ జాలును. అట్లు లొప్పగించుటలో విద్యార్థియు విద్వాంసుఁడును, కొన్ని సమయములందు సములే యగుచుందురు. మఱికొన్ని సమయములందు కంఠమాధుర్యము మాత్రము చక్కఁగనుండినయెడ విద్వాంసునికన్న విద్యార్థియే యధికుఁడనిపించుకొనును. సభలందు ముఖ్యముగ ముందు గౌరవింపఁబడవలసినది విద్యాధిక్యము గాని కంఠమాధుర్యమును, కనుల యందమును, ముఖవిలాసమును గావు కదా లేకయున్నచో నాలుగు వర్ణములను ఐదు కృతులను నేర్చి కంఠమాధుర్యమాత్రముచే ఘనుఁడనని శాలువఁ దలఁజుట్టుకొని సభలందు నిల్చెడి పండితవేషులు కొల్లలుగ బయలువెడలరా? ఇట్లనుటచే గాయకులకు కంఠమాధుర్య మనవసర మని తలఁపఁగూడదు. విద్యాధిక్యముతోఁ గూడినకంఠమాధుర్యమే పూజనీయము. విద్యాధిక్యములేని కంఠమాధుర్యము వాద్యమెఱుఁగనివాని చేతిలోని నాణెమగు ఫిడేలువలెనే యుండును. కావున సభలందు విద్యాధిక్యమే ప్రథమగణ్యమగుచున్నది అట్టి విద్యాధిక్యమును కేవలపాఠము లొప్పగించుటయందుఁ బరీక్షించుట కలవికాదు. పాఠశాలలయందును విద్యార్థియొక్క సామాన్యశక్తి (General ability) ని ముందు పరీక్షించి యనంతరము కొన్ని పద్యములనో పాఠములనో అప్పగించుకొందురు. అట్టులే యచ్చటను జరుగవలసియున్నది అట్టులయినచో నే యే సమర్థ

తలు ఏ యే పరీక్షలచేత నీపాఠకునియందుఁ బరీక్షింపఁబడవలసియున్నవి? అని చదువరులకు సంశయము పొడమకమానదు. కావున నవి యిట వివరింపఁబడును.

## సంగీతవిద్యాపరీక్ష

| సమర్థతలు. | పరీక్షింపవలసిన పాఠములు. |
| --- | --- |
| 1. మందవిద్యార్థి కెల్లప్పుడును పుస్తకాపేక్ష యేయున్నట్లు లీపాఠకునకుఁగృతులందువలె నెల్లప్పుడును స్వరాపేక్ష యే కలదా?స్వరాపేక్ష లేక సంగతులను ధారాళముగఁ బ్రయోగింపఁగలఁడా? | రాగమును విరామముగా నాలాపన చేసి, పాడుట |
| 2. రాగముయొక్క వర్జ్యవక్రాదినియమములఁ బాటించుచు సంగతులను దశప్రాణయుతి తాళబద్ధ మగునట్లు ధారాళముగఁగల్పింపఁ గలడా? | తానాది సంగతిసహితంబుగఁ బల్లవిని బాడుట |
| 3. గొంతు తిరిగినటులు సంగతులఁ బ్రదిప్పుచుండెనా లేక యా సంగతులందలి స్వరస్థానపరిచయ మీతనికిఁ గలదా? అట్లయిన నట్టి సంగతులను స్వరమునఁ గూడ గల్పింపఁ గలఁడా? | పై నిబంధనలతోడ స్వరకల్పనఁ జేయుట. |
| 4. ఈసంగతులను, స్వరమును ముందుపాఠము చేసికొని వచ్చి పాడుచుండెనా,అపుడు తెలివిచే గల్పించి పాడుచుండెనా? | ఇచ్చిన పల్లవిని బాడుట. |
| 5. ఈతఁడు పెద్దల గ్రంథము నేమైన సంప్రదాయసిద్ధముగఁ బఠించెనా,పల్లవియందు మాత్రము తెలివితోడఁ బెనఁగులాడుచుండెనా? | కొన్ని వర్ణములను కృతులను బాడుట. |

పాఠకుని వివిధములగు సమర్థత లిట్లు పరీక్షింపఁబడవలసియున్నవి. కాని పైఁజెప్పఁబడిన 'ఇచ్చినపల్లవిని పాడుట' యను నాలుగవపనియందుఁ గొన్ని నియమములు కలవు పరీక్షకు లా నియమములఁ బాటింపనిచోఁ బరీక్ష్యులకు నష్టము కలుగుననుటకు సందియ మిసుమంతయు లేదు. ఆ నియమము లెవ్వియనఁగా —

1. రాగములును తాళములును అనంతములై యుండెఁగానఁ బాఠకున కభ్యాసము లేని యొక నూతనరాగంబునఁ గాని నూతన తాళంబునఁ గాని పల్లవి నీయఁగూడదు

2. కొందఱు పాటకులు ఏ నూతనరాగతాళములయందైనను, వాని నియమముల నపుడు పరీక్షకులవలనఁ దెలిసికొని,తమ యసమాన ప్రతిభావిశేషంబున నప్పటికప్పుడు సమర్థించి పాడఁగలిగియుండుదురు అట్టివారలకు మాత్ర మేనూతనరాగతాళములందైన నీయవచ్చును. అట్లు పాడినను అది యొక యసాధారణ ప్రజ్ఞయు, ప్రతిభావిశేషంబును నగును గాని పాటకుని సాధనబలము కాదు. కావున దీనిని సామాన్యవిధిగఁ గైకొనఁ గూడదు.

3. పాఠకుని యనుభవజ్ఞానమును, కల్పనా సామర్థ్యమును పరీక్షించుటే ప్రకృతాంశముగాన శ్రవణమాత్రమున జ్ఞాపకముంచుకొనుట కలవికానన్ని పదములతోఁ గాని, నోరుతిరుగని జేతులతోఁగాని పల్లవి నీయఁగూడదు

పరీక్ష్యుఁడే యే రాగములందు, నే యే తాళములందుఁ బాడుట కంగీకరించునో తెలిసికొని, యొకటిరెండు తడవలు విన్నమాత్రమున నరలఁ బాడఁదగినట్లు లుండు పల్లవి నీయఁదగును అనంతర మాతని యనుభవజ్ఞానమును, కల్పనాసామర్థ్యమును, మఱి యితరప్రజ్ఞలను శ్రద్ధతోఁ జూచుచుండవలయు. కాని మొదలే యుచ్చరించుట కలవికాని పల్లవి నిచ్చినయెడ నితరప్రజ్ఞలన్నియు వ్యర్థమైపోవును గాన నట్లొసఁగ గూడదు. కావునఁ బరీక్షకు లీ నియమంబులఁ బాటించుచుఁ బల్లవుల నీయఁదగును

సాధారణముగా సభ్యు లిట్లు పరీక్షించుట నపేక్షింప కుండినను పాఠకులు తా మనుభవజ్ఞానములేని సామాన్యులుగఁ బరిగణింపఁబడకుండుటకై తమంతటఁదామే రాగమును బల్లవిని పాడుచుందురు. కొన్ని సమయములందు సభ్యులు, పాఠకుని బరీక్షించు పని తమ తాత్కాలికోద్యమము కాకుండుటచేతను, అట్టి పరీక్షాగానమువలన నానందింప వలెననెడి యిచ్ఛ తమకు లేకుండుటచేతను, ఆ పల్లవిపాట తమకు వలదని యెఱిఁగించినను స్వప్రయోజకత్వప్రకటనాపేక్ష యెవ్వారికి నవిలంఘనీయమగుటచేఁ బాఠకు లెట్టులైన సందుఁజేసికొని సుంతయో రవంతయో దానిని పాడఁ జూచుచుండుటయుఁ దటస్థపడుచుండును.

ఇట్లు పరీక్షించు తాత్పర్యమే సభ్యులకు సాధారణముగ నుండనిచోఁ బరీక్షావిధానముం గూర్చి యింతగ వివరించుట యనవసరంబు కాదో యని చదువరులు శంకింపవచ్చును. కాని యిది యనవసరము కాదు. ఏలయనఁ బరీక్షించు ప్రయత్నము సభ్యులకు సకృత్తుగ నుండినను పాఠకులు మాత్రము తమలోఁదాము తగువులాడి యొండొరులఁ బరీక్షింపఁ జూచుట తఱచుగఁ దటస్థించుచుండును. అట్టి తరుణములందు వారిలో విద్యాధికులు గెలుపొందుటకు బదులు సహజముగఁ బరీక్షావిధానమునే నెవశ్రాత్తమైన నెఱిఁగినవారును, యుక్తిపరులును, సమయోచిత ప్రసంగచతురులును నగువారు మాత్రము గెలుపొందుట తటస్థించుచుండును. అట్టి సమయములందెల్ల నీ వివరణము పాఠకులకు సంజీవిపలెను, మధ్యవర్తుల కనుండు తీర్పరులకు వజ్రాయుధమువలెను ఉపయోగించును అట్టి తగువులందెల్లను బల్లవియే ముఖ్యమగు నన్యోన్యపరీక్షాసాధనంబుగఁ గైకొనఁబడుచున్నది కావున నెన్నివిధంబులఁ దరిచిచూచినను పల్లవిపాట 'విద్వాంసుని జ్ఞానమును బరీక్షించుటకు' ఆయియున్నది

గీ॥ తాళదశవిధులను సుంత ♦ తలఁగ కుండ
రాగసంగతులను గూర్చి ♦ రక్తిఁ జేర్చి
చాల స్వరకల్పనము సేయు ♦ జ్ఞానధనున
కీయఁ బల్లవి తగును ప ♦ రీక్ష కొఱకు.

ఏవిద్యయందుఁ గాని, యే విద్యార్థి గాని, యే కాలమందు గాని సంపాదింపఁజూచునది జ్ఞానము గాని కొన్ని పాఠములు కావు. కొన్ని పాఠములను మాత్రము సంపాదించుకొనుట యెటువంటి దనఁగా పండ్లు కోరునాతఁ డొకరి తోఁటలోనికిఁ బోయి కొన్ని పండ్లను దెచ్చుకొనుట వంటిది. జ్ఞానమును సంపాదించుట యనఁగాఁ దన తోఁటలోనే యా ఫలవృక్షమును బెంచుట వంటిది. కావున విద్యార్థి సర్వప్రయత్నములచే దత్తద్విద్యా జ్ఞానమును సంపాదించి యనంతరమం దా జ్ఞానమును స్వోపయోగార్థమును లోకోపయోగార్థమును ఉపయోగించును. ఇందుకు దృష్టాంతముఁ జూడుఁడు. సంస్కృత విద్యార్థి పంచకావ్యములను, కొన్ని నాటకములను, అలంకార గ్రంథములను జదివి పూర్తి చేయునప్పటికి సాహిత్యపండితుఁ డనఁబడును. అప్పు డాతఁడు తన పాండిత్యము నెట్లు లుపయోగించునో చూచితిరా ! లోకమున కుపయోగించు న్యాయ వేదాంత జ్యోతిషాది శాస్త్రములలో నొకటి రెంటిని జదివి వానిని లోకో పకారార్థ ముపయోగించును. అట్టి శాస్త్రములఁ జక్కఁగ నన్వయించు కొనుటకుఁ దన పాండిత్యము నుపయోగించును. అట్లు కానిచోఁ బురా ణాది గ్రంథముల నన్వయించుటకైన నుపయోగించును. కాని తాను ముందు పఠించిన శ్లోకముల నొప్పగించుటే తనపనిగా మాత్రము పెట్టు కొనఁడు.

మఱియొక దృష్టాంతముఁ జూడుఁడు. ఇప్పటి యాంగ్లేయ పాఠ శాలలయందు విద్యార్థి బి. యే, పరీక్షయందు గెలుపొందు నప్పటి కాంగ్లేయ భాషయందుఁ గొంతవఱకు పాండిత్యమును గలవాఁ డగును. అంతట ఇంజినీ రగుటకు బి. సి, పరీక్షకో, వైద్యుఁడగుటకు యం. డి, యం. బి సి. యం. మొదలగు పరీక్షలకో, న్యాయవాది యగుటకు బి. యల్ , పరీక్షకో మఱిదేనికో చదువును గాని తాను ముందు చల్లించిన పాఁతపాఠముల నొప్పగించుటకు మాత్రము ప్రయత్నింపఁడు.

ఇట్లులే యే విద్యయందైనను గురుసమ్ముఖమునఁ బఠించిన పాఠ ములవలన విద్యార్థి జ్ఞానమును సంపాదించి యనంతర మా జ్ఞానము నుప

యోగించుకొనుటయే కనవచ్చుచున్నది. కాని యీ సంగీత విద్యయందు మాత్రమే కారణంబుననో గాని మఱియొకమార్గము కనవచ్చుచున్నది. ఎట్లనఁగా:— గీతములు ప్రారంభ విద్యార్థిపాఠము లగుటచేత వానిని సభాముఖంబున నెవ్వరును బాడుట లేదు. వర్ణములు మధ్యవిద్యార్థికి తాన స్వరకల్పనా జ్ఞానమును బోధించుటకు నేర్పఁబడు పాఠములు. అయినను వానిని గొందఱువిద్వాంసులు మాత్రము సభలందుఁ బాడుచుందురు. కృతులు ఆరూఢవిద్యార్థికి రాగరసోత్పాదన కౌశలమును బోధించు పాఠములు. ఈ కృతు లన్నియు దైవభక్తిబోధకములై యుండును. వీనినే ప్రతి విద్వాంసుఁడును కొల్లగ సభాముఖంబునఁ బాడుచుండును. పల్లవిని బాడినను బాడకున్నను కృతులను బాడుట మాత్రము తప్పనివిధి. వీనియందలి సంగతులు మొదలగు విశేషములన్నియుఁ గవి కల్పితములే. ఇందలి పరనకౌశల మంతయు గురుముఖంబున నభ్యసింపఁబడినదే. ఇఁక విద్వాంసుని పని యున్నదున్నటుల నప్పగించుటే కాని మఱేమియు లేదు. ఇట్టిపాఠములే పెక్కులుగ విద్వాంసులచే సభాముఖంబునఁ బాడఁబడుచున్నవి. కొందఱు పాఠకులు వీని యనంతరంబున నొకటిరెండితరములైన పాటలను బాడినను అట్టి పాటలు విద్వద్ధర్మము కాదని తలఁచువారును గొందఱు కలరు.

ఈ సంగతి మిగుల విచారణీయ మగుచున్నది. ఎట్లన:— ఈ నేర్చిన పాఠములఁ బాడుటే విద్వద్ధర్మమా? ఇదియే విద్వద్ధర్మమైనయెడ నాతని జ్ఞానమును పల్లవిపాటచేత నేల పరీక్షింపవలెను? ఆ జ్ఞానమునకు వినియోగ మెచ్చట? దొమ్మరవాఁడు త్రాడుపై నడచుటను జూచి యానందించినట్లు లీ పల్లవిపాటను గూడ నొక వినోదమాత్రముగఁ గైకొందుమని చెప్పఁదగునా? ఈ పల్లవిపాటయొక్క ప్రథమబీజము భరతాచార్య మతానుసారముగ త్యాగయ్యగారు మొదలగు సంగీత విద్వాంసులచే రచియింపఁబడిన తానవర్ణముల చరణములందే కన్పట్టుచుండుట లేదా? కేవల వినోదముగఁ బరిగణింపఁబడుటకే, వార లట్టి మార్గమును జూపిరని వచింపనగునా? ఇఁక నీ సంగీతవిద్యార్థియొక్క

చిరప్రయాసార్జితమైన జ్ఞానమువలన ఫలమేమి? పాతపాఠముల నొప్పగించుటే ఫలమా?

ఇచట విద్వాంసుల మార్గమును విమర్శింప దొరకొనినందుల కట్టి విద్వాంసులు సాదరులై మన్నించుచు భిన్నాభిప్రాయంబులఁ దగు రీతిం దెల్పుదురుగాక. సంగీత విద్వాంసుని సమర్థత కేవల వినోదమాత్ర ముగఁ బరిగణింపఁబడఁదగినది కాదు. కార్యమగు పల్లవి యెప్పుడైనవినోదము కావచ్చును గాని కారణమగు జ్ఞాన మెప్పుడును వినోదము కానే కాదు. జ్ఞాన మెప్పుడును వ్యర్థమును గాదు. ఇఁక నీతని జ్ఞాన మెందుల కుపయోగించు ననఁగా:—మనుజున కీ లోకంబున వలయునది దైవభక్తి యొక్కటే కాదు. ప్రభుభక్తి, దేశభక్తి, గురుభక్తి, మాతృపితృభక్తి, నీతి, ధైర్యము, శౌర్యము, జ్ఞానము, వైరాగ్యము ఇత్యాది యోగ్యతలు పెక్కులు వలసియున్నవి. వీని నన్నిటిని గూర్చిన పాటలను జనరంజకము లగునట్టులు వినిపించి బోధించుటకు సంగీతజ్ఞానము ముఖ్యమగు సాధనము. కేవల వర్ణాత్మకనాదసహితములై యొప్పు వేదవేదాంతవేదాంగ శాస్త్రపురాణేతిహాసకావ్యనాటకాలంకారాదుల కెల్ల వన్నె దెచ్చుటకే ధ్వన్యాత్మకనాదభేదజ్ఞాన ముపయోగింపఁబడవలసి యున్నది. కావుననే వేదములు స్వరసహితంబులుగనే పఠింపఁబడుచున్నవి. దైవభక్తిని సంగీత సహితంబుగ బోధించుటచేఁ ద దితరవిషయంబులఁ గూడ నిట్టులే ప్రజలకు బోధింపఁదగు నని త్యాగరాజాదులు త్రోవఁజూపియున్నారు. నేఁటివఱకును రణరంగమందు భటులను వీరావేశ ముద్భవింపఁజేసి మేను మఱచున ట్లొనర్చుచున్నది సంగీతమే గాని మఱియొకటి కాదు. జనసంఘముయొక్క యప్పటప్పటి స్థితుల ననుసరించి వలయు విషయముల నారయా కాలములందలి కవులు పాటలుగ రచించుచుందురు. వారలకు సంగీతజ్ఞాన ముండుట యరుదు. ఆ పాటలను దత్త ద్రసోచితములగు సంగీత సంగతులచేత నలంకరించి వానిని జనరంజకములగున ట్లొనర్చు పని సంగీత విద్వాంసునిది. కృతులందువలె సంగతులను జిట్టలుగా నేర్ప వలసిన యవసరము లేకయే తాను దొల్తసంపాదించిన జ్ఞానమహత్వ

ముచేఁ దత్తద్విషయోచితములగు సంగతులను ఆశుధారను గల్పించి పాడవలసిన విధి సంగీత విద్వాంసునిది. అట్లు లోనర్చిన వారలే నిజమగు విద్వాంసులు. అట్టివారలదే యనుభవపూర్వకమగు నిష్కళంకజ్ఞానము. తరంగములను, అష్టపదులను, అధ్యాత్మరామాయణ కీర్తనలను బాడుట విద్వాంసునకు గౌరవహీనము కాదు. కృతుల నొప్పగించెడివారికన్న నట్టి వానిని గృతులవలెఁ బాడువార లెక్కుడు సమర్థులుగ నెన్నఁబడవలసి యుందురు.

కావున సంగీతపాఠకుని జ్ఞానము కృతులొప్పగించుటకుఁ గాక తత్తత్సమయోచితముగ రచియింపఁబడిన పాటలకు వన్నె వెట్టి కృతుల వలెనే సర్వజనరంజకములగున ట్లొనర్చి వినిపించుట కయియున్నది. ఇటు లనుటచేఁ గృతు లనవసరములనిగాని రసహీనములనిగాని యేరును భ్రమింపఁ జనదు. కృతులఁ బాడఁదగును. ఆనందముగ వినఁదగును. కృతులే మనకు మార్గదర్శకము లయియున్నవి. అట్టి కృతులను శ్రమచేసి వల్లించి వాడి జనుల నానందపఱుచుచుండినందులకు సంగీతవిద్వాంసు లెంతయు వందనీయులై యున్నారు. కాని యా కృతులనే పట్టుకొని కూరు చుండక యా కృతులు చూపెడు మార్గమును బట్టుకొనుటకే యీ పాటకుని జ్ఞాన ముపయోగింపఁ బడవలసియున్నది.

ఆ–వె. పాఁత పాఠములను ♦ వల్లించుటకుఁ గాదు
గానవిదుని తొంటి ♦ జ్ఞాన మెల్ల
కృతులు వర్ణములును ♦ సతతము సూచించు
గతుల ననుసరింపఁ ♦ గలుగు కొఱకు.

## 17. అనవసర ప్రసంగములు.

ఒకానొక సభయందు డంబాచారి, మితభాషి
యను నిద్దఱు గాయకులు చేరఁగా సభ్యులు వారి
నిద్దఱిని గలిసి యేదైనఁ బాడుఁడని కోరిరి.
అంతట వారి కిద్దఱకు నిట్లు ప్రసంగము జరిగెను.

డంబాచారి—(తనలో) ఏమి యీ చిత్రము ! ఈ కాలములో శాలువఁ జుట్టుకొని బయలుదేరినవాం డ్రడడఱును సంగీతపారకులే యగుచుం డిరి! నే నఁట, యీతనితో నఁట, కలిసి యఁట, పాడవలె నఁట. ఈతనిఁ జూడఁగ బడిపిల్లగానివలె నున్నాఁడు. నా సంగతి నేను చెప్పకయే నన్నుఁ జూడఁగనే తెలియుచున్నది ఇట్టివానితోనా నేను కలిసి పాడుట ఇతనిని డాబుచేసి మూఁడుముక్కలలో చాచా వ్యావ్యా అనిపించి మరల నోరెత్తకుండఁ జేసి యనంతరము నే నొక్కడనే పాడుకొనెద. బహుమతిని నేనే పొందెదను. (ఇట్లనుకొని రెండవ గాయకునిఁ జూచి) ఏమయ్యా పాఠకుఁడుగారూ నీ పేరేమయ్యా? నోరెత్తి మాటనే చెప్పలేకయున్నావు, సంగీతమేమి పాడెదవయ్యా!

మితభాషి—ఉత్తరము చెప్పుటకే యవకాశ మీయరైతిరికదా. నా పేరు మితభాషి. యందురు.

డంబా—మాట్లాడనేర్చినవాని కొక రవకాశ మీయువలయునా? పైగా 'అవకాశమీయరైతిరి' యని నాపై నొక తప్పు వెదకినావు! ఇట్లు తప్పులు వెదకుటయేనా నీవు నేర్చుకొనిన విద్య? ఇంకేమైనఁ గలదా? నీకు విద్య నెవరు నేర్పిరి?

మిత—నా గురువుగారిపేరును బట్టియే నన్ను గౌరవింపఁదలఁచితిరా ? నావిద్యనుబట్టి కాదా?

డంబా—ఓహో ! నీ ప్రసంగము 'పిట్ట కొద్ది కూఁత ఘనము' అన్నట్లు గానే యున్నదే. సరేగాని నీ వేమిపాడెదవో చెప్పు.

మిత—తమ చిత్తము. ఏదైనను ప్రారంభింపుఁడు తమచిత్తప్రకారమే పాడెదను. [వా?

డంబా—ఏదైనను బాడెదవుగా! 'డం డం జానకి' అనెడు కృతిని బాడెద.

మిత—ఏదైనఁ బాడెద ననఁగా రాగమును బల్లవిని బాడునపుడు చెఱి రెం డ్డావర్తములు పాడెదమనియుఁ, గృతిని బాడునపు డది మన యిద్ద ఱకు వచ్చినకృతియైనచోఁ గలిసిపాడెదననియుఁ, గానిచో మీ రొక కృతి పాడిన నేను మఱియొక కృతి పాడెదననియు నన్వయింపఁదగును

గాని మీరు పాడెడి ప్రతిపాటను నేను ముందెత్తిగి పాడవలయుననియు, మీరు స్వరకల్పనను బాడునపుడు మీకల్పననే నేనును గూడఁ బాడవలయుననియు, మీమాటలనే మీతోఁగూడ మాట్లాడుచుండవలయుననియు నన్వయింపఁ దగునా? అట్టు లెవ్వరికైన సాధ్యమగునా?

డంబా—అబ్బో నీకు సంగీతముపాడుటకంటె లెక్చరులిచ్చుట బాగుగఁ దెలిసినట్టులున్నదే నీ లెక్చరులో నేమో 'పల్లవిపాట, స్వరకల్పన' అను మాటలు వినఁబడినవి. నీవేమైనఁ బల్లవిపాడెదవా యేమి?

మిత—లేశమాత్రము పాడెదను.

డంబా—అందఱుఁ బల్లవులఁబాడెడివారే. అందఱు స్వరకల్పనఁజేసెడివారే. నీ స్వరకల్పన యనంతరము చూడవచ్చును గాని స్వరము అనఁగా నేమో నీకుఁ దెలియునా?

మిత—స్వరము అనఁగా నేమో తెలియనిచో నేను పల్లవిఁ బాడుటకు సాధ్యముకాదా?

డంబా—స్వరశబ్దమే నీకుఁ దెలియనిచో నీవు పాడెడి పల్లవేమిటయ్యా!

మిత—అట్లయినచో స్వరశబ్దార్థమే పల్లవిని బాడునా?

డంబా—నీ వీ దడ్డవాదములు నేర్చుకొనినంతగా సంగీతమును నేర్చుకొన్నదో బాగుండునుకదా? తెలిసినచో జవాబు చెప్పరాదా? లేనిచోఁ జేతులు జోడించి చేతకాదనరాదా?

మిత—అయ్యా! మీరేల యాగ్రహించెదరు? చెప్పెద నాలకింపుఁడు. స్వతః రంజయతి స్వరం. అనఁగా స్వయముగ రంజించునది స్వరము అనఁబడును. ఈ శబ్దార్థము పల్లవిపాట కెంతవఱకుఁ దోడ్పడునో తామే సెలవిండు.

డంబా—(ఆశ్చర్యముతోఁ దనలో) అరే! చెప్పినాఁడే! అయిన నింతటితో విడువఁజనదు. ఇటువంటివే మఱి నాల్గుప్రశ్నలను వేసి చూచెద. (అని ప్రకాశముగా) సరే. వినినముక్క నొకదానిఁ జెప్పితివిగాని 'స' అనునది యేదేశమందుఁ బుట్టినదో చెప్పు.

మిత— అయ్యా సంగీతమును ఆవలనుంచి జగడమాడినను ఆ జగడము గూడ వినువారలకు ప్రయోజనకారిగనుండవలయు కాని 'స' యెక్కడఁ బుట్టెననియు, 'రి' యే వస్త్రమును ధరించుననియు, 'గ' యేమి భుజించుననియు నిట్టి ప్రశ్నల మీ రడుగఁబోచ్చిన యెడ వీనివలన నెవ్వరికిఁగాని యేమిప్రయోజన ముండును. కావున నిట్టివానికి నేను ప్రత్యుత్తర మీయను. మిగిలి యడిగితిరి కాన దీని కొక్క దానికి మాత్రము చెప్పెదను 'స' జంబూద్వీపమునందుఁ బుట్టె నని సంగీతగ్రంథములందుఁ గలదు. దాని ప్రయోజనము నాకుఁ దెలియదు. మీకుఁ దెలిసినఁ జెప్పుఁడు.

డంబా—(తనలో) ఆబ్బో! ఈతఁడు సులభముగ వంగివచ్చునట్లు లేఁడు. నే నడుగఁదలఁచిన ప్రశ్నల నన్నిటిని ముందే గ్రహించి యొకటే సారిగఁ గొట్టివేసినాఁడు. ఈ విషయములో నింక మెదలరాదు. లేనియెడ సభికులుగూడ నీతనిపక్షమే యగుదురు కాని యింకొక యెత్తు పన్నవలసియున్నది అదెద్దియన, నిపు డీ ప్రసంగము నొక యగాధమగు శాస్త్రగాథలోనికి మార్చెద దానియం దీతఁడు తగు ప్రత్యుత్తరముల నీయఁజాలఁడు. ఆ మాట నిశ్చయము ప్రశ్నను వినినతోడనే యేమియుఁ దోఁచక గ్రుడ్లు మిణకరించును. ప్రశ్నలు శాస్త్రగుప్తార్థబోధకము లగుటచే సభికులును మహానందంబున నాలకింతురు (ప్రకాశముగా) ఏమయ్యా! నీవేమో కొన్ని ప్రశ్నల నొల్లనంటివి. పోనిమ్ము. మఱి యొక్కటి నడిగెదఁ జెప్పుము.

మిత—చిత్తము, సెలవిండు.

డంబా—నీకు రాగప్రస్తారము తెలియునా?

మిత—కొంతవఱకు.

డంబా—శుద్ధసావేరిరాగమునకు ఆరోహ ణావరోహణములఁ జెప్పుము.

మిత—సరిమపధస - సధపమరిస॥

డంబా—ఇది యే మేళకర్తయందు జన్యించెను,

మిత—ఖరహరప్రియయందు,

డంబా—గౌరీమనోహరియందు జన్మించెనని చెప్పఁగూడదా?

మిత—చెప్పవచ్చును.

డంబా—హరికాంభోజియందు జన్మించెననవచ్చునా?

మిత—అట్లును జెప్పవచ్చును.

డంబా—ధీరశంకరాభరణమందు జన్మించెననియుఁ జెప్పనచ్చునా?

మిత—అట్లును జెప్పవచ్చును.

డంబా—ఇదేనా నీ ప్రస్తారజ్ఞానము? ప్రతిరాగమందును జన్మించెనందువా!

మిత—ప్రతిరాగమందును జన్మించెనని నేను చెప్పితినా? ఈరాగ మీ నాలుగుమేళకర్తలయందును జన్మించునని మీరుమాత్రము చెప్పరా!

డంబా—ఎట్లుజన్మించునో చెప్పుము.

మిత—ఖరహరప్రియాగౌరీమనోహారీ రాగములకు ఒక్క నిషాదమందు మాత్రమే కదా భేదముకలదు. ఆ నిషాద మీ రాగమందు మొదలే లేదయ్యెను. కావున నిట్టిరాగ మా రెండుమేళకర్తలయందును బుట్టు ననుటకు సందియమేమి? మఱియు ఖరహరప్రియకును హరికాంభోజి కిని ఒక్క గాంధారమందే కదా భేదముండుట ఆ గాంధారమును నీ రాగమందు లేదయ్యె. కావున నీ రాగభేద మా హరికాంభోజియందు మాత్రము జనింపదా? హరికాంభోజికిని ధీరశంకరాభరణమునకును ఒక్క నిషాదమందే భేదము ఆ నిషాదము దీనియందు లేదని ముందు వచించితిఁ గదా. కావున నిది యా ధీరశంకరాభరణమందును జన్మించును ఇంతయేల? ఒక్కచుట్టున జెప్పెద వినుఁడు ఖరహరప్రియ, గౌరీమనోహరి, హరికాంభోజి, ధీరశంకరాభరణము అను నాలుగు మేళకర్తలనుండియు గాంధారనిషాదములఁ దొలఁగించినయెడ నా నాలుగింటికిని లేశమాత్రమును భేదము లేదుకదా. ఈ శుద్ధసావేరి రాగంబున గాంధారనిషాదములు రెండును లేవుకదా. ఆ నాలుగు మేళకర్తలను బ్రస్తరించినపుడు వానిలోఁ బ్రతిదానియందును నిట్టి భేదమొకటి జన్మింపకయుండునా? ఇందు మీ సందియ మేమి?

డంబా——ఈ నాలుగిటిలో దేనియందీ రాగము జన్మించెనందువు?
మిత——ఈ నాలుగింటియందును ఈ భేదము జన్మించెనందును.
డంబా——అట్లుకాదు. ఈ నాలుగిటియందుఁ బుట్టిన భేదములలో నే భేదమునకు ఈ పేరు పెట్టఁబడినది?
మిత——నాలుగింటియందు జన్మించినను భేదము ఒక్కటే జన్మించినది గాని నాల్గుభేదములు జన్మింప లేదు. అట్టి యొక్క భేదమునకే యీ పేరు పెట్టఁబడినది.
డంబా——అట్లు కాదయ్యా. నాలుగును ఒక్కసారిగఁ బ్రస్తరింపఁబడ లేదుకదా. ఒకదానివెనుక నొకటి ప్రస్తరింపఁబడినది. అందు మొట్టమొదట ఏమేళకర్తను బ్రస్తరించునపుడు పుట్టినభేదమునకు ఈ 'శుద్ధసావేరి' అను పేరు పెట్టఁబడినది?
మిత—— మొట్టమొదట ఏపనివానిచే, ఏగ్రామములో, ఏకొలిమిలోఁ జేయఁబడిన పనిముట్టునకు గొడ్డలి యను పేరు పెట్టఁబడినది? మీరు చెప్పుఁడు.
సభ్యులు——(చప్పటలుగొట్టుచు నవ్వుచున్నారు.)
డంబా——అంతకంటెఁ జెప్పుటకు వీలు లేదా?
మిత——నే నెట్టులు చెప్పుదును? అన్నిరాగములకును నామకరణము చేయఁబడలేదు చేయఁబడిన కొన్నిటికైనను నామకరణముచేయు సమయమందు నేను జూడలేదు చూచినవారు నాకుఁ జెప్పలేదు. నేను జూచినవఱకు గ్రంథములలో దాని కాధారము కనఁబడలేదు. మఱికొంత ప్రయత్నించుటకైన నిది యనవసరవిషయ మని నాకుఁ దోఁచలేదు ఇంతకన్న మీ కేమైనఁ దెలిసినచో సెలవిండు.
డంబా——కాదయ్యా యిటు విను. ఇట్టు లొక్కొక్క రాగంబును పది మేళకర్తలయందు జన్మించె నని చెప్పుట సరసముగ నుండునా?
మిత——ఏల యుండదు? అది నా తెలివితక్కువచేతఁ గాని మఱియొకటి తెలివితక్కువచేతఁ గాని కలుగుట లేదుకదా. ఎవరు ప్రస్తరించిన నట్టులే కలుగును. ఇందేమి దోషముండును?

డంబా—(తనలో) ఈతఁడు శాస్త్రవాదముచేత లోఁబడునట్టులు లేఁడు. నే నిదివఱకుఁ బెక్కండ్రతో జగడంబులఁ గల్పించుకొని వాదించితిఁ గాని యెవరు నింతదూరము దనుక నన్ను డీకొనియుండ లేదు. ఈతఁడు శాస్త్రమును గూడఁ జక్కఁగఁ బరిశీలించి యున్నవాఁడు ఇఁక నేమి సేయుదు? ఈతనికే లోఁబడుదునా? కాదు కాదు. ఇంతలో నేను త్వరపడఁ గూడదు మఱియొక్క మార్గము నా మనంబునకుఁ బొడకట్టుచున్నది. ఈతఁడు బహుశః గ్రంథములఁ జూచి విషయములఁ బఠించి యుండును వాని నన్నిటి నిచటఁ బాఠముపలె నొప్పగించు చున్నాఁడు. కావున నీతనితోడ నిఁక శాస్త్రవాదము నాకుఁ బ్రయోజనకారి కాదు యుక్తివాదముచేత నితని నష్టమునఁ బూసి నేరేడుకాయఁ జేసి నేను సఫలమనోరథుఁడ నయ్యెద. దీనియం దీతఁడు చూచూ వ్యావ్యా అని యనకమానఁడు లేక యుండినచో యుక్తులను గూడ నే శాస్త్రమందుఁ జదివియుండును? అది వట్టి మాట ఇఁకఁ నా దెబ్బకుఁ దిరుగు లేదు. (మీసి ధైర్యము తెచ్చుకొని మాతనిఁ గాంచి) ఏమయ్యా! పరముఁడుగారూ! నీ కేమో తలనిండ మాటలు వేయుండినట్లున్నది ఏమేమో చెప్పుదువు. ఒకమాటకు మఱొక మాటకు సందర్భము కనఁబడదు. పోనిమ్ము ఈ శాస్త్రచర్చను వదిలి మఱియొక సులభమైన విషయము నడిగెదఁ జెప్పెదవా?

మిత్ర—చిత్తము. తమ యభిప్రాయము మెట్టులో యట్టులే కానిండు. మన ప్రసంగమందలి గుణాగుణముల నరయుటకు సభ్యులు కలరుకదా.

డంబా—నీ వేమో మేళకర్తలు రాగములు ననుచుంటివే. ఆ రాగము లెట్లు కలిగినవి?

మిత—మేళకర్తను ఒకటి రెండు స్వరముల వర్జించుచుఁ బ్రస్తరించుటచే.

డంబా—స్వరములా? స్వరము లనఁగా నేవి?

మిత—సరిగమపధని అనునవి.

డంబా—ఆ యక్షరములే యుండవలె నని యేమిసిద్ధాంతము? 'స' అనుటకు బదులు 'క' అనఁ గూడదా? 'రి' అనుటకు బదులు 'ల' అనఁ

గూడదా ? ఇట్లే సరిగమపధని అనుటకు 'కలవరప్రియ' అను నేడిటిని స్వరములుగఁ జేసికోనఁ గూడదా ?

మిత—మీ శంక బాగుగనే యున్నది గాని ఈ స్వరము లెందుకుఁ గల్పింపఁ బడినవి ?

డంబా—శ్రుతులకుఁ బేర్లుగా నుండుటకు.

మిత—ఆ శ్రుతు లెవ్వరిచేఁ గనిపెట్టఁబడినవి?

డంబా—మన పూర్వులచే.

మిత—ఆ శ్రుతులకు వా రేర్పఱచిన పేళ్లయందు దోషము లేమైన మీకుఁ గన్పట్టెనా ?

డంబా—లేదు.

మిత—అందు మీ రేమైన నభివృద్ధిఁ జేయనెంచితిరా ?

డంబా—అభివృద్ధి కాదుగాని యీ సప్తస్వరములకే వేఱు పేర్లు పెట్టెదను.

మిత—ఆ సప్తస్వరములకును స్థానములైన శ్రుతులను మీరు కనిపెట్టలేదు. ఆ శ్రుతులఁ గనిపెట్టినవారు వాని కేర్పఱచిన నామములందు దోషములు గలవని మీరు చెప్పుట లేదు. వారి చేసినదానికి మీరు వన్నెఁ దెచ్చు నదృశ్యమైన లేదు. ఇఁక వారు కనిపెట్టిన శ్రుతిభేదములకు వారు పెట్టిన పేళ్లను జెడఁగొట్టి మీరు మారుపేరు లేల పెట్టవలెను?

డంబా—పెట్టఁ గూడదా ? పెట్టుట దోషమా ?

మిత—ఇల్లు విప్పి పందిరివేసెద మందురా ?

డంబా—పందిరివేయుట కాదు. మఱల నింటినే కట్టెదను.

మిత—ఉన్న యింటి నూడఁబెఱికి మఱలఁ గట్టెదమందురా?

డంబా—నీవు అధికప్రసంగివిగా నున్నావే ! చేతనైనయెడల ప్రత్యుత్తరముఁ జెప్పరాదా ? ఉపమానవాక్యములతోఁ బనియేమి ?

మిత—అయ్యా! యేల యాగ్రహించెదరు ? తెలిపెద నాలకింపుఁడు. పెద్ద లిరువదిరెండు శ్రుతిభేదములను దొల్తఁ గనిపెట్టిరి. వాని నాదుకను. గూర్చి భిన్నాభిప్రాయంబులు కలవు. వానిం గూర్చి

చెప్పఁబూనినయెడఁ బ్రత్యేకముగ నొక యుపన్యాస మగును. అది యప్రస్తుతవిషయము. దాని నటుండనిండు. అనంతర మెవ్వరో పెద్దలు వానిని 12 శ్రుతులుగ భాగించుకొని, వానికి వేఱుగఁ బేళ్లువెట్టి, వానిలో నాలుగింటికి రెండేసి పేళ్లు పెట్టుటచే వానిని 16 గఁ జేసి, వానిచే డెబ్బది రెండు మేళకర్తల నేర్పఱచిరి. ఆ పదియాఱు శ్రుతులనే యేడు భాగములుగాఁ జేసి వానికిఁ బేళ్లుగా వెనుకటి సప్తస్వరములనే యుంచిరి. ఆ మార్గమే యిపుడు విద్వాంసు లెల్లరచేత నవలంబింపఁబడుచున్నది. మీ రిపుడు మహాజ్ఞానసంపన్నులయి వచ్చినందులకు వారొనర్చిన మేళకర్తలనే గైకొని వారొనర్చిన శ్రుతిభేదములనే గైకొని వారిపేళ్లను జెడఁగొట్టి మీపేళ్లు పెట్టుట సరసము కాదు మీరే నాదబ్రహ్మమును జక్కఁగ బరిశీలింపుఁడు. అవసరములఁగనిపెట్టి దానిని ఇరువదియో ముప్పదియో శ్రుతులుగా విభజింపుఁడు వానిని బదియో పదునైదో భాగములుగా నొనర్చి వానికి మీ యిష్టమువచ్చిన స్వరనామధేయములఁ బెట్టుఁడు. పిమ్మట వానిం బ్రస్తరించి రెండువందలో మూఁడువందలో మేళకర్తల గావింపుఁడు. అనంతరము వానికి మీరే లక్ష్యలక్షణముల వ్రాసి యితరులకు బోధించి నూతన సంగీతప్రష్టలు గండు. అది సరసముగ నుండును. కాని 'స' తీసి 'క' పెట్టెదననియు, 'రి' తీసి 'ల' పెట్టెదననియు, 'గ' తిసి 'వ' పెట్టెదననియుఁ జెప్పినచోఁ, జిరకాలాగతమై బహుజనవిదితమైన క్రమమును జెడఁగొట్టి బల్లకు గోడయనియు, గోడకు మంచమనియు, మంచమునకుఁ గుంచమనియుఁ బేళ్లువెట్ట నెంచినట్టులు రసాభాసమునకుఁ గారణమగును. కాఁబట్టి యాచారములోనున్న స్వరములకు మీరు మాఱుపేళ్లు పెట్టుట తగదు.

డంబా—(విషాదముతోఁ దనలో) ఔరా! యెంతబాగుగ సమర్థించి నాఁడు! ఇదివఱకు నా మైరావణప్రజ్ఞలచేత నెందఱినో మోసగించి పరాభవించితి గాని యీతఁడు మాత్రము పులినిమ్రింగిన పుట్ట వలె నా పాలిటికిఁ బరిణమించినాఁడు. ఇంకేమి సేయుదు. ఇఁక నిచట నాకు గౌరవము జరుగదు. దేశమును విడిచి పాఱిపోవలసి వచ్చుచున్నది.

(అని పరితాపపడుచు)ఏమయ్యా పాఠకుడుగారూ ! ఇట్లు ప్రసంగింపఁ జూచినయెడ శాస్త్రగాథ చాలగలదు. నేఁడు కాలాతీతమైనది. ఈ విషయ మిప్పటికిఁ జాలించి పోవుదము, లెండు.

మిత—చిత్తము. చిత్తము. చిత్తము.

ఇట్టి ప్రసంగముతోడ నాఁటి సభ ముగిసెను. సభ్యులెల్లరు మిత భాషిగారి ప్రత్యుత్తరములకు మిగుల నానందించిరి. ఈ ప్రసంగ మంతయు జ్ఞానమునకుఁ బనికివచ్చును గాని గానసభయందు అనవసరమే యని చెప్పఁదగును. చక్కఁగ శ్రమచేసి పాడి సభికుల నానందపఱుపఁ గల పాఠకున కీ విషయములు తెలియకున్నను లోపముకలుగదు. తెలిసి యెక్కువ పాడునది లేదు. కాని డంబాచారులు కొందఱు వారిల నడ్డదిడ్డపు శంకలఁజేసి యవమానపఱుచుచుందురు. విషయము తెలిసి యున్నను సమయోచితముగ జవాబుచెప్ప నేర్చియుండవలెఁ గదా. పై డంబాచారిగారి యనవసర ప్రశ్నలలో దేనికిఁ బ్రత్యుత్తరమీయఁ జాల కున్నను మితభాషి యవమానపడవలసినవాఁడే కదా. సంగీతవిద్వాంసు లందు సాహిత్యవిద్యానిపుణత మిక్కిలి యరుదుగఁ గనవచ్చుచున్నది. దానింబట్టియే ప్రసంగనైపుణియు నుండదుగదా. కావున నట్టి సమయము లందు నిష్పక్షపాత హృదయులగు సభికులు జోక్యముఁ గలిగించుకొని యనవసరములఁ దోలఁగించి ధర్మమును నెలకొల్పుదురుగాక. అట్టి సభ్యుల యుపయోగార్థమే యీ గ్రంథము ముఖ్యముగ వ్రాయఁబడినది.

చ. తనుఘనుఁడంచుఁ జూపుకొన ♦ దంభచరిత్రుఁడు ధూర్తుఁడై సభా
జనముల మోసగించుటకు ♦ శాస్త్రము శాస్త్రమటంచు నెవ్వియో
యనవసరప్రసంగముల ♦ నట్టె యడావడిఁ జేసి యక్కటా
యనుపమ గానకౌశలుల ♦ నల్లరివెట్టెడు నిద్ది చెల్లునే?

గీ. కాన సభికులు నిటువంటి ♦ గ్రంథములను
జదివి తత్త్వముల నెల్ల ♦ సంగ్రహించి
యనవసరములఁ దొలఁగించి ♦ యమృతతులిత
గానరసమును జవిగొనఁ ♦ గలుగుఁ గాక.

## 18 బెదరించు ప్రశ్నలు, ఉత్తరములు.

ఎదుటిపాటకుఁడు పాడునది యెంత శాస్త్రసమ్మతముగను, సరసమ్ముగను, జనరంజకముగను ఉండినను గొందఱు దంభవిద్వాంసు లెవ్వారొకటి రెండప్రస్తుతప్రశ్నల నాతని నడిగి వాని కుత్తరము తోఁచనే ప్రత్యుత్తర మీయఁజాలక పోయినచో నాతని బెదరించి, "ఈతఁడు సుమారుగఁ బాడును గాని శాస్త్రవిషయము లీతనికిఁ దెలియవు, మఱియుఁ బాడెడిదానియందును అచ్చటచ్చట దోషంబులు కలవు" అని పలువురిలో నాతని నిరసించుచుందురు. అట్టి ప్రశ్నల సమాధానరూపంబున బోధించు టనవసరమని తోఁచినందున నవి యిటుఁ బ్రశ్నోత్తరరూపంబున సంగ్రహముగ వివరింపఁబడుచున్నవి.

| ప్రశ్నలు. | ఉత్తరములు. |
|---|---|
| 1. నాదశబ్దమునకు అర్థమేమి? | నకారము ప్రాణనామకము, దకారము అగ్నినామకము, ఇట్టి ప్రాణాగ్నిసంయోగముచే నాదము పుట్టుననియు, నర్థము. |
| 2. నాదము ఎటులు పుట్టును? | ఆత్మ మనస్సును ఉద్బోధించును. ఆ మనస్సు నాభియందున్న యగ్నిని కొట్టును ఆ యగ్ని వాయువును ప్రేరేచును. ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు అను నీ నాలుగును జేరి నాదమును బుట్టించును. |
| 3. ఆహతనాదము అనఁగా నేమి? | ప్రయోగింపఁబడు నాదము. ఒకనిచే ప్రయోగింపఁబడు పలుకుచే వినఁబడఁజేసిన నాదము. |
| 4. అనాహతనాదము అనఁగా నేమి? | ఋషులచే ప్రయోగింపఁబడక తానుగా ధ్వనించెడి అంతర్ముఖమగు ప్రణవనాదము. దీనినే యేకాగ్రచిత్తమున ఋషు లెల్లరు నారాధింతురు. |

| | |
|---|---|
| 5. శ్రుతి యన నేమి? | షడ్జాది స్వరారంభకావయవ మైన హ్రాస్వమాత్రకధ్వనివిశేషము |
| 6 స్వరము లెట్లు పుట్టెను? | శ్రుతులవలన |
| 7. స్థాయి అన నేమి? | షడ్జము మొదలుకొని ఆరోహాగతిగా సప్తస్వరముల నుచ్చరించి మరల షడ్జము నందుకొనుట ఒక్క స్థాయి యనఁబడును. |
| 8. స్థాయు లెన్ని? వాని పేరు లెవ్వి? | మూఁడు మంద్రస్థాయి, మధ్యస్థాయి, తారస్థాయి |
| 9. షడ్జ మనఁగా నర్థమేమి? | 'రిగమపధని' అను నాఱుస్వరంబులకును జననస్థానమైనది మఱియు నాసిక, కంఠము, ఉరస్సు, తాలువు, జిహ్వా, దంతములు అను నాఱుస్థానములందుఁ బుట్టినది అని యర్థము. |
| 10. వికృతిని బొందని స్వరము లెవ్వి? | షడ్జము, పంచమము. |
| 11. వికృతిని బొందు స్వరముల నియతశ్రుతు లెవ్వి? | శుద్ధఋషభము, అంతరగాంధారము, శుద్ధమధ్యమము, శుద్ధధైవతము, కాకలినిషాదము. |
| 12. వికృతినిబొందుట యన నేమి? | స్వరము తన నియతశ్రుతిని విడిచి దాని పై శ్రుతినిగాని,దిగువశ్రుతినిగాని చేకొనుట |
| 13. అనులోమ మన నేమి? | తాళాక్షరము ఒకటింటికి స్వరాక్షరములు 2, 4, 8 యగునట్లు రెట్టించి పాడుట |
| 14. విలోమము అన నేమి? | స్వరాక్షరము ఒకటింటికి తాళాక్షరములు 2, 4, 8 యగునట్లు రెట్టించి పాడుట. |
| 15. మూర్ఛన యన నేమి? | సప్తస్వరములఆరోహణావరోహణములు |
| 16. గ్రామము అన నేమి? | మూర్ఛనలతోఁ గూడి యున్న స్వరసమూహము |

| | |
|---|---|
| 17. గ్రామము లెన్ని? అవి యెవ్వి? | మూడు. షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాంధారిగ్రామము. |
| 18. ప్రారంభవిద్యార్థికి స్వరము లన్నియు మాయామాళవగౌళ రాగమందే యేల సాధనము చేయింప వలయును? | ఈ రాగమునందు స్వరములన్నియు నియతశ్రుతులతోఁ గూడియుండె నని, అందుచేత నిది విద్యార్థికి సులభంబుగ నుండునని. |
| 19 రాగాంగము, ఉపాంగము, క్రియాంగము, దేశాంగము అన నేమి? | ఇవి రాగభేదములు సంపూర్ణ రాగములు రాగాంగము లనఁబడును. షాడవౌడవభేద జన్యములు ఉపాంగము లనఁబడును. వక్ర రాగములు క్రియాంగము లనఁబడును. రెండు రాగములను గలుపుటచే బుట్టినవి దేశాంగము లనఁబడును. |
| 20. శుద్ధము, ఛాయాలగము, మిశ్రము అనఁగా నేమి? | ఇవి రాగములందలి తరగతులు. ఎట్లనఁగా, శాస్త్రోక్తరీతిని పాడఁబడినవి శుద్ధములు అన్యరాగచ్ఛాయతోఁ గలపఁబడినవి ఛాయాలగములు, ఈ రెండును గలిసినవి మిశ్రములు. |
| 21. గ్రహస్వరము, న్యాసస్వరము, అంశస్వరము అన నేమి? | రాగముయొక్కగాని సంగతియొక్కగాని మొదట నిలుపఁబడిన స్వరము గ్రహస్వర మనియు, చివర నిలుపఁబడినది న్యాసస్వరమనియు, నడుమనడుమ పలుసార్లు ప్రయోగింపఁబడినది అంశస్వర మనియుఁ జెప్పఁబడును. |
| 22. నష్టము, ఉద్దిష్టము అన నేమి? | ఈ రూపమునందు ఇన్నవభేద మెద్ది యనఁగా జెప్పెడు విధము నష్టము అనఁబడును. ఈ రూప మెన్నవభేదము అన్నఁగాఁ జెప్పెడు విధము ఉద్దిష్టము అనఁబడును. |

| | |
|---|---|
| 23. తాళశబ్దమునకు వ్యుత్పత్త్యర్థ మేమి? | తల ప్రతిష్ఠాయాం అను ధాతువుచే దీని యందు గీతవాద్యనృత్యములు ప్రతిష్ఠితము లై యున్నవి అని. |
| 24. తాళము ఎట్లు ఉత్పత్తి యగును. | కాలము, క్రియ, మానము అను మూఁడును ఏక కాలమందుఁ గలియుటచే. |
| 25. కాలము, క్రియ, మానము అన నేమి? | క్షణాదికము కాలము; చేతులు తట్టుట మొదలగునది క్రియ; క్రియలమధ్యనుండు కాలము మానము. |
| 26. ఆవర్తమన నేమి? | తాళాంగము లన్నియు నొక్కసారి చుట్టివచ్చుట. |
| 27. అనుద్రుతమునకుఁ గల వివిధనామము లెవ్వి? | అనుద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము. 6. |
| 28. ద్రుతమునకుఁగల వివిధ నామము లెవ్వి? | అర్ధమాత్ర, ద్రుతము, వ్యోమము, బిందువు, వలయము, చక్రము. 6 |
| 29. లఘువునకుఁ గల వివిధ నామము లెవ్వి? | మాత్ర, సరళము, హ్రస్వము, కళ, లఘువు, శరము. 6. |
| 30. స్వరజతి యన నేమి? | స్వరముతో సమముగా తానసహితమైన సాహిత్యమును గల పాట. |
| 31. సంగీతము ఎందుకు? | వర్ణాత్మకనాదసహితములైన వేదశాస్త్ర పురాణాదులను జనరంజకము లగునట్లు చేసి వినిపించుటకు. |
| 32. మహత్తు అనఁగా నేమి? | గొప్పది అని నైఘంటికార్థము. ప్రస్తరింపఁబడుటకు మొదటఁ బెట్టుకొనఁబడిన రూపము మహత్తు అనఁబడును. |
| 33. మేరువు అనఁగా నేమి? | శిఖరము అని నైఘంటికార్థము. ప్రస్తరింపఁబడిన భేదముల వేఱువేఱుసంఖ్యలను వివరముగాఁ దెలుపు పథకము. |

34. సారణి యనఁగా నేమి? వీణ, తంబుఱ, ఫిడేలు మొదలగుజంత్రము లందు షడ్జస్వరమును బలికించెడి తంతి.

35. గమకము అనఁగా నేమి? శ్రోతృచిత్త సుఖావహమైన స్వరముల కదలింపు.

ముందు దెల్పఁబడిన అనవసరప్రసంగములు అను వ్యాసమునందు గాని, ఈ బెదరించుప్రశ్నలు అను శీర్షిక క్రిందఁగాని వ్రాయఁబడిన వన్నియు ననవసరములే యని చదువరులు భ్రమింపఁగూడదు. శాస్త్రజ్ఞానము నపేక్షించువాని కివి యన్నియు నవసరములే. కాని యీ నామముల నెఱుఁగక పోయిన మాత్రముచేత సమర్థముగఁ బాడిన పాఠకుని వ్యర్థునిగఁ దృణీకరించుట యధర్మమని తెలుపుచు నట్టి సమయములం దీ చదువరులే జోక్యముఁ గలిగించుకొని ధర్మమును నెలకొల్పునట్టి సమర్థత నిట్టి గ్రంథపఠనమువలనఁ బడయుదురు గాక యని యిట్లు వ్రాయఁబడినది.

గీ. ఒనర నీ ప్రశ్నలకును బ్రత్యుత్తరములఁ
జెప్ప నేరక యున్నచోఁ జెడుగు మూఁడుఁ
జెప్ప నేరిచి యధికంబుఁ జేయ లేరు
గాని నేరిచియుంటయే గట్టితనము.

## 19. వ్యుత్పత్త్యర్థములు.

(సంగీతమందు దఱచుగా వచ్చు నామముల వ్యుత్పత్త్యర్థములు.)

1 షడ్జము—షట్సు స్థానేషు జాయత ఇతి షడ్జః. జనీ ప్రాదుర్భావే. శ్లో॥ నాసా కంఠ మురస్తాలు - జిహ్వా దంతాంశ్చ సంస్పృశన్ । షడ్భ్యస్సంజాయతే యస్మాత్ - తత షడ్జ స్స ఉచ్యతే॥. అనఁగా నాసిక, కంఠము, వక్షస్సు, తాలువు, నాలుక, దంతములు అను నీ యాఱుస్థలములందును బుట్టునది గనుక షడ్జము అనఁబడుచున్నది.

2. ఋషభము—ఋషతి (హృదయం ప్రవిశతి) ఇతి ఋషభః. ఋష గతౌ. అనఁగా హృదయమును బ్రవేశించునది. మఱియు ఋషభ

స్వరసంవాదిత్వాద్వా ఋషభః. అనఁగా వృషభస్వరమువంటి స్వరమును బలుకునది ఋషభము. దీనిని సంగీతవిద్వాంసులు రిషభము అనియు వాడుచుండిరి.

3. గాంధారము—గాం (వాచం) ధరతి ఇతి గాంధారః. ధృఞ్ ధారణే. వాక్కులను ధరించునది. 2 స్వరాంతరస్య గంధం (లేశం) ఆ రాతి ఇతివా గాంధారః. రా ఆదానే. అనఁగా స్వరాంతరము యొక్క శ్రుతిని బుచ్చుకొనునది గాంధారము. 3 గాంధార దేశీయైః గీయత ఇతివా గాంధారః. గాంధార దేశపు జనులచేఁ బాడఁబడునది గాంధారము.

4. మధ్యమము—శ్లో॥ తద్వదేవోత్థితో వాయు - రురః కంఠ సమాహితః నాభిప్రాప్తో మహానాదో మధ్యస్థత్వాత్తు మధ్యమః ॥ 1. ఉరః కంఠములతోఁ గూడి మధ్యావయవమైన నాభివలనఁ బుట్టునది. 2. స్వరాణాం మధ్యస్థితత్వాద్వా మధ్యమః. సప్తస్వరముల మధ్యమునం దుండునది మధ్యమము.

5. పంచమము—శ్లో॥ వాయు స్సముత్థితో నాభే - రురో హృత్ కంఠ మూర్ధసు। సంచరన్ పంచమ స్థాన - ప్రాప్త్యా పంచమ ఉచ్యతే॥ అనఁగా నాభి, ఉరస్సు, హృదయము, కంఠము, శిరస్సు అనెడి యైదు స్థానములందుఁ బుట్టునది గనుక పంచమము. మఱియు పికైః పంచ్యత ఇతివా పంచమః. పచి విస్తారే. కోయిలలచేత విస్తరింపఁబడునది గనుక పంచమము.

6. ధైవతము— 1. ధీమద్భి ర్గీయత ఇతి ధైవతః. అనఁగా బుద్ధిమంతుల చేతఁ బాడఁబడునది. 2 ధావతి (నాభ్యాది స్థానేభ్య ఆగచ్ఛతి) ఇతివా ధైవతః. ధావు గతి శుద్ధ్యోః. అనఁగా నాభ్యాదిస్థానముల వలనఁ బుట్టునది ధైవతము.

7. నిషాదము—నిషీదంతి స్వరా అస్మిన్ ఇతి నిషాదః. షద్ ల్ఌ విశరణ గత్యవసాదనేషు. కడపటిస్వర మగుటవలన దీనియందు స్వరము లన్నియుఁ జేరియుండును.

8. వీణ—వేతి (జాయతే) స్వరః అస్యామ్ ఇతి వీణా. వీ గతి ప్రజన కాంత్యసన ఖాదనేషు. దీనియందు స్వరము పుట్టును గాన వీణ యనఁబడును.

9. మృదంగము—మృద్యత ఇతి మృదంగః. మృద మర్దనే. కొట్టఁబడునది మృదంగము. 2. మృత్ అంగమస్యేతివా మృదంగః. మట్టి అంగముగాఁ గలది మృదంగము.

10. మంద్రము—మందతే (శనైః నిస్సరతి) ఇతి మంద్రః. మది స్తుతిమోద మద స్వప్న కాంతి గతిషు. మెల్లగాఁ బలుకఁబడునది.

11 తాళము—తలంతి (తిష్ఠంతి) గీత వాద్య నృత్తాని అత్ర ఇతి తాలః. తల ప్రతిష్ఠాయాం. నృత్త గీత వాద్యములు దీనియందు నిలిచియుండును.

12. లయ—లీయంతే నృత్తగీతాదయః అస్మిన్ ఇతి లయః. లీజ్ శ్లేషణే. నృత్తగీతాదులు దీనియందు సమముగాఁ గూడియుండును.

## 20. సంగీత కవిత్వము.

సంగీతమందు గీతములు, వర్ణములు కృతులు లోనగువానిని రచించుటయు, అప్పటప్పటికి విద్వాంసులలోఁ గలుగుచుండు వివాదాంశంబుల విమర్శించి పూర్వపక్షసిద్ధాంతంబుల గ్రంథరూపంబునఁ బ్రకటించుటయు, శాస్త్రిగుప్తార్థంబుల సర్వజనులకు సులభగ్రాహ్యంబులగునట్టు లంతకంతకుఁ దేలికయగు శైలిని బద్యగద్యరూపంబుల వెల్లడించుచు మఱియుఁ దొంటి భరతాచార్యులచే రచింపఁబడి ముద్రణంబునఁ బ్రకటింపఁ బడక యుండిన శాస్త్రగ్రంథంబులనుండి వివిధార్థముల సంగ్రహించి వానిని బహుజనోపయోగార్థము ప్రకటించుచు గ్రంథములరచించుటయు అను మూఁడువిధముల కార్యముల నొనర్చుటకు 'సంగీతకవిత్వము' అని యిటఁ జెప్పఁబడినది. ఈ సంగీత కవిత్వమును గూర్చి చెప్పుటకుఁ బూర్వము కవి, కవియొక్క విధులు, కవిత్వము, దానిలాభము, అది లేకున్నచోఁ గలుగు నష్టములు మొదలగు వానిఁ గూర్చి యించుక వివరింపవలసి యున్నది. అందులకుఁ జదువరులు మన్నింతురు గాక.

ఏదేశమునందుఁగాని ఏకాలమునందుఁగాని మానవకోటికి కవి వలనఁ గలుగు నుపకారములను వివరించి వర్ణింపఁబూనినచో భారతంబు లగుననుటకు సందియంబు లేదు. పసితనమునుండి మనము పఠించుటకు వలయు పొత్తంబులఁ దరగతులవరుసను కవి రచియించి యొసంగును. ఆయా వయస్సులందు మన ప్రవర్తనలను జక్కఁబఱుచుటకు వలయు ధర్మంబుల బోధించును. మనుజుఁ డేకారణంబుననైన శ్రమఁజెంది, కల వరమునంది యుండినపుడు తన యపూర్వకల్పనాచాతుర్యముచేఁ గల్పింపఁబడిన చిత్రవిచిత్రవర్ణనాలంకారములచే నాతని చిత్తంబును రంజిల్లఁ జేయును. ఎవ్వాఁడుగాని ఐహికసుఖంబుల రోసి విరక్తుఁడై యుండునపు డాతనికి బ్రహ్మానందసుఖసాగరంబున నోలలాడింపఁ దగు పరతత్వబోధల నొనర్చి చిత్తవిశ్రాంతి నొసంగును. ఇట్టి కవివలన నుపకారము నొందని పురుషుం డీ ధాత్రి నొక్కఁడైన నుండునా? చిలుకలను, గోరువంకలను, స్త్రీల కచకుచాద్యవయవములను గొల్లలుగ వర్ణించి తృప్తిఁ జెందు కవులఁ గొందఱి నావల నుంచి తక్కినవారి సంగతినే యోచింపుఁడు. విద్యాధిక్యముచేఁ గాని, దాతృత్వముచేఁ గాని, ధైర్యముచేఁ గాని, రణశూరత్వముచేఁగాని మఱియే సుగుణముచేఁగాని మానవసంఘమం దేపురుషుఁడైన నసమానత్వమును స్థాపించినచో నాతని యోగ్యతను, ఆతని యితరసద్వర్తనములను వివిధగతుల వర్ణించి సంఘమం దట్టి ఘనులను మఱి నూర్వ్వర వెలువడఁజేయు సమర్థత కవికిఁ గాక మఱి యెరికిఁ గల్గు? ఇట్టి కవియొక్క సమర్థత తదితరుల సమర్థతవలె నాతనితో నంతరింపదు. ఎట్లనఁగా నొక రణశూరుఁడు మరణించినయెడ నాతనిసమర్థత యాతనితోడనే యంతరించును. ఒక విద్వాంసుఁడు గతించినయెడ నాతని విద్య యాతనితోడనే యంతరించును. ఒకప్రభువు గతించినయెడ నాతని యధికార మాతనితోడనే గతించును. కాని కవిసమర్థత యట్టు లంతరించునా? కవిశిఖామణి యనందగు బమ్మెర పోతనామాత్యుఁడు చని యిప్పటి కెంతకాలమయ్యె? అతఁడు రచించిన భాగవతమందలి యమృతతుల్య వాక్యములు నేఁటివఱకును మానవహృదయముల నపారసుఖసాగరంబునఁ

దేల్చుచుండలేదా? ఆతఁడు దినదినంబును మన కన్నులయెదుట నిలిచి బోధించుచుండునట్లు లాతని వాక్యంబులు మన చెవిం బడుచుంట లేదా? నాఁడు మొదలు నేఁటివఱ కెందఱు ప్రభువులు, ఎందఱు విద్యాధికులు, మఱి యెందఱు శూరులు పుట్టిరి గిట్టిరి. వారి పే రేమైనఁ గలదా? కావుననే యొక కవి యిట్లు వచించెను.

క. గుడి పడును; నూయి పూడును,
వడినీళ్ళకుఁ జెఱువు తెగును వనమును ఖిలమౌఁ
జెడనిది పద్యము సుమ్మా,
కుడియెడమలు చూడకన్న గువ్వల చెన్నా!

మఱియొక్కటిఁ జూడుఁడు. దశకంఠుఁడగు రావణుఁడు ఎంతటి బలశాలి! ఎంతటిశూరుఁడు. సహజదుష్టస్వభావుఁడును నిఖిలజనకంటకుఁడు నయ్యు సురనరయక్షకిన్నరాదులచేత నెంతగఁ బూజలందె! ఇపు డాతని యాజ్ఞలకు వెఱచువార లెవ్వరైనఁ గలరా? ఆతని చట్టంబుల నెవ్వ రైన మన్నించుచుండిరా? ఆతనివాక్యంబుల కెవరైన నానందించు చుండిరా? ఆతఁడు మరణించిన యుత్తరక్షణమందే యాతని తొంటి యాజ్ఞలెల్ల నుల్లంఘింపఁబడలేదా? ఆతని సమర్థత యేమయ్యెను? ఆతని తోడనే రూపుమాసెను. రావణుండు నిఖిలలోకభయంకరమూర్తియు, సమర్థుఁడును నగు ప్రభుఁడనియు, పోతనకవి నిరుపాధికుఁడును, అసమర్థుఁ డును నగు నొక పేదబ్రాహ్మణుండనియు భ్రమఁజెందినవార లిపు డీ యిద్దఱి సమర్థతలను బోల్చిచూడనిండు. ఆతఁడు భయంకరవాక్యములతోఁ జట్ట ములొనర్చె. ఈతఁడు మృదువాక్యములతోఁ జట్టము లొనర్చె. ఆతఁడు ప్రజల శరీరముల వశపఱచుకొని సేవలందె. ఈతఁడు ప్రజల హృదయము ల వశపఱుచుకొని పూజలందెను. ఆతని ప్రతిభ యాతనితోడనే నశించె. ఈతని ప్రతిభ యీతని యనంతరము వందలకొలఁదిసంవత్సరముల వఱకు కోటిసూర్యప్రకాశంబున జగంబును సదా వెలిగించుచుండెను. ఆతఁడు తన చట్టములను పత్రములపై వ్రాసెను. ఈతఁడు తన చట్టములను

మానవహృదయములపై వ్రాసెను. ఆతని చట్టము లాతనితోడ నేపోయెను. ఈతని చట్టములు మానవహృదయములందు శాశ్వతములై యుండి సర్వ కాలములందును సర్వజనులచేత నతివినయభయభక్తులతో గౌరవింపఁ బడుచుండెను. కవిసమర్థత నెఱుంగుటకీ దృష్టాంతము చాలదా?

ఇట్టి కవిసమర్థతచేతనే యే దేశమందుఁగాని యే కాలమందుఁగాని యేవిద్యయైనను బోషింపఁబడవలసియున్నది. జ్యోతిషగ్రంథముల నెవరు వ్రాసిరి? వైద్యగ్రంథముల నెవరు వ్రాసిరి? మఱి యితర శాస్త్రగ్రంథముల నెవరు వ్రాసిరి? కవులు కాదా? కవి వ్రాయనిదే యేగ్రంథమైన నెట్టులు వచ్చును? దేశంబునఁ గవియే లేఁడనుకొనుఁడు. అపుడు మన విద్య లెట్టులుండును? ఎఱుకలవాని భాషవలెనే యుండును. మన వైద్యజ్ఞాన మెట్టులుండును? 'పైత్తిరోగానికి మాంద్' అను మందులవాని జ్ఞానము వలెనే యుండును. కోదువవిద్యలును అట్టులే యుండును. కావున నేకాలమునం దేవిద్యయందు కవులు లేకయుందురో యాకాలమునం దా విద్య లంతరించుననుటకు సందియము లేదుకదా.

; ఇఁక సంగీతవిషయమును జిత్తగింపుఁడు. పూర్వకాలమందు నారదుఁడు, అర్జునుఁడు, నందికేశ్వరుఁడు మొదలగు ముప్పదియిద్దఱు భరతాచార్యులు సంగీతశాస్త్రంబున లక్ష్యలక్షణసమన్వితంబులగు గ్రంథముల రచియించియుండిరను మాట మాత్రము ప్రస్తుతకాలపు కొన్ని సంగీత గ్రంథములందుఁ గనవచ్చుచున్నది. కాని యా గ్రంథములు మాత్రము కలికంబునకైనఁ గానరావు. అవి యన్నియు నేమయ్యెను? నశించెనా? లేదులేదు. అన్నియు నశింప లేదు. కొన్నిమాత్రము అనఁగా బహుశః రెండుమూఁడు మాత్రము ఇంకను గొనయూపిరితో నున్నవి. వార్ధకదశలో నుండిన యాగ్రంథరాజములను పోతనామాత్యుని పుత్రుంబోలిన కొందఱు మహాభక్తులు సగౌరవంబుగఁ బూజించుచున్నారు. పోతనామాత్యుఁడు తాను రచియించిన భాగవతమును ఒక పెట్టెలోఁ బెట్టి తన యువసానకాలమందుఁ దనపుత్రుని కొప్పగించుచు "నాయనా! ఇదియే నా

మూలధనము. అర్హులగువారికి దీని నర్పింపుము" అని చెప్పెనఁట. ఆ పుత్రుఁడు తనకు అర్హులగువారలే కన్పడలేదని తన యావజ్జీవితకాలమును ఆ పెట్టె మూఁతనైనఁ దెఱవక దాని నతిభక్తితో ననుదినము పూలఁ బూజించి గతించెనఁట అనంతరము దానిం దీసి చూడ నందలి పత్రము లన్నియుఁ బురుగులచేఁ దినఁబడి భ్రష్టములై యుండఁగా మఱికొందఱు కవులు వానిం జక్కఁజేసి ప్రచురించిరఁట. అట్టులే యీ భక్తులును పూర్వపు సంగీతగ్రంథశేషములఁ బూర్ణభక్తితోఁ బూజించుచుండిరి. కాని యట్టి యొక్క గ్రంథమైనను వారి పేరుమీఁద ముద్రణంబునఁ గనవచ్చుట లేదు.

అనంతరము మధ్యకవులనఁబడఁదగిన దీక్షితులవారు, త్యాగరాజు గారు, శ్యామశాస్త్రులవారు మొదలగు వారు తొంటి భరతాచార్య మతానుసారముగఁ గొన్ని లక్ష్యములను అనఁగా గీతములు వర్ణములు కృతులు లోనగువానిని వ్రాసిరి. ఆలక్ష్యములే ప్రకృతకాలపు సంగీతా భ్యాసకులకును విద్వాంసులకును ముఖ్యాధారము లైయున్నవి.

ఇఁకను ఆధునికకవు లనఁబడఁదగిన మన యాంధ్రదేశపు ప్రకృత కాలపు కవుల సంగతిని జిత్తగింపుఁడు. వీర లిప్పటికి ముప్పది సంవత్సర ములనుండి* మాత్రము గ్రంథములఁ బ్రకటించుచుండిరి ఇందు వీరలు పూర్వకవి ప్రోక్తములగు కొన్నిలక్షణములను మధ్యకవి ప్రోక్తములగు కొన్ని లక్ష్యములను మాత్రము ప్రకటించుచువచ్చిరి. ఇందు మొదటిది ప్రపంచ సర్వేశ్వరశాస్త్రులవారు ప్రకటించిన సంగీత సర్వార్థసారసంగ్ర హము. పిమ్మటఁ గొన్నిమాసములకే శ్రీమాఁతచ్చూరుశింగరాచార్యుల వారును వారి సోదరులును ఈగ్రంథరచనకుఁ బూనుకొని తొంటి లక్ష్య ములనెల్లఁ దరగతులుగా విభజించి క్రమంబుగ 1 స్వరమంజరి,2 గాయక పారిజాతము, 3 సంగీతకళానిధి, 4 గాయకసిద్ధాంజనము, 5 గాయక

* క్రీస్తుశకము 12 వ శతాబ్దము మొదలు 16 వ శతాబ్దము వఱకును శార్ఙ్గదేవులు, అహోబలులు, వేంకటమఖి మొదలగువారు కొన్ని గ్రంథముల రచించిరి. అనంతరము గ్రంథములు రచింపఁబడెననుట కాధారములు కనవచ్చుట లేదు.

చనము అను గ్రంథములను అప్పటప్పటికిఁ బ్రచురించి సంగీతవిద్యార్థుల కు మహోపకారముఁ గావించిరి ఇట్టులు 1900 సంవత్సరమువఱకును నూతనలక్ష్యము లేవియుఁ బ్రకటింపఁబడలేదు. అంతటఁ బ్రసిద్ధవిద్వాంసు లగు తిరువత్తూరు వీణ కుప్పయ్యగారి కుమారులగు బ్రహ్మశ్రీ తిరువత్తూరు త్యాగయ్యగారు 1900 సంవత్సరమున పల్లవి స్వరకల్పవల్లి* అను గ్రంథ మును బ్రకటించిరి. దానియందు వారి తండ్రిగారురచియించినట్టియు వారు స్వయముగరచియించినట్టియు పెక్కువర్ణములులోనగువానిఁ బ్రకటించిరి. మఱియు రాగమూర్ఛనల గూర్చియు వ్రాసిరి. 1904 వ సంవత్సర మున ఉమ్మడిసెట్టి వెంకటస్వామినాయఁడుగారు సంగీతవిద్యాదర్పణము అను గ్రంథమును వ్రాయుచు నందు వారు రచించిన మూఁడు తానవర్ణ ములను, ఒక్కస్వరజతిని, ఒక్కగీతమును బ్రకటించిరి. పిమ్మట 1905 వ సంవత్సరమున తచ్చూరు చినశింగరాచార్యులువారు గాయకసిద్ధాంజన ము రెండవభాగమును బ్రకటించుచు నందు వారును వారి సోదరులు ను రచియించిన పెక్కు కృతులను బ్రకటించిరి. ఇట్టులే మఱికొందఱు నేమైన వ్రాసియుండవచ్చును.

ఈ గ్రంథప్రకటనపద్ధతియందుఁ జదువరు లొక్క విషయమును ముఖ్యముగ గమనింపవలసియున్నది. అదెద్దియనఁ బ్రకృతకాలమున మన దేశపు సంగీతవిద్వాంసులలో గ్రంథకరణోత్సాహమును గలవార లరుదు గ నుండుటయు, వారును స్వయంకృతలక్ష్యములఁ బ్రకటించుటయందు వెక్కుముందాడుటయుఁ గనవచ్చుచున్నది. దీనిని బట్టియు, మఱి కొంద ఱాధునికవిద్వాంసుల ప్రసంగములను బట్టియు దీని కారణ మూహింపఁ దగియున్నది. ఎట్లనఁగా:—గొంద ఱి ట్లనుచుందురు. "పూర్వము మహాను భావులు భరతాచార్యులు శాస్త్రముల వ్రాసిరి. అనంతరము త్యాగయ్య గారు లోనగు విద్వాంసులు గీతములు, వర్ణములు, కృతులు రచించిరి.. మనము రచించుట కెంతవారము? మనవారిలోఁ గొందఱు రచింపఁ

---

* వీరే 1907 సం॥న సంకీర్తనరత్నావళి అను గ్రంథమును గూడఁ బ్రచురించిరి. ఈ రెండు గ్రంథములును విద్యార్థులకంటె విద్వాంసుల కెక్కుడుగ నుపయోగించును.

బూనుట వారల స్వాతిశయభావమును సూచించును. మఱియు నది పెద్దల గ్రంథమును అగౌరవపఱుచుట యనఁబడును. సమర్థతయున్న యెడఁ బెద్దలగ్రంథమును జక్కఁగఁ బాడిన నంతియచాలును" అని యాధునిక విద్వాంసులు కొంద ఱిట్లు ప్రసంగించుచుఁ దాము క్రొత్తవానిని వ్రాయకపోఁగాఁ దమ సాటివారు వ్రాయఁబూనుచో వారల సర్వవిధంబుల నిరుత్సాహపఱుతురు. వారు వ్రాసినదానిని దాము మన్నింపకపోఁగా నెటులైన నిరసింపఁజూచుచుందురు. సంగీతవిద్వాంసులలో సాహిత్యపరిచితి అసలే యపురూపమగుచున్నది. ఈ దినమందు సంగీతవిద్వాంసులలోఁ గొందఱు నిశానీదారులై యుండిరని వచించుటకుఁ బరితాపము వొడముచున్నది. అచ్చటచ్చట విద్యాధికులు కొంద ఱుండినను సగటువిద్వాంసు (Average songster) నకు వైపరీతగగతివిద్యార్థి కన్న నెక్కుడుపాండిత్యముండుట యరుదు. అట్టి వారిలో నెదుటివారి కవిత్వమును నిరసించువారలే యెక్కుడుగ నుందురు. కాని స్వయముగ వ్రాయువారలు అరుదు. ఎట్టెటులో శ్రమపడి వ్రాసినను వారి నీ యితరవిద్వాంసుల నిరసనప్రతిబంధకము మిక్కిలిగ బాధించుచుండును. ఇదియే పైఁజెప్పఁబడిన పద్ధతికి ముఖ్యకారణ మని చెప్పఁదగియున్నది.

ఒకవేళ నీ కవిత్వమును చేతఁగానివా రందఱును జెప్పఁబోయినచోఁ బ్రయోజనమేమి యని కొందఱు శంకింపవచ్చును. కాని యది సరికాదు. ఏలయనఁ జేతఁగానివాఁడో చేతనగువాఁడో ముం దెట్లు తెలియును? ఆతఁడు రచియించెడి గ్రంథము రసవంతమే యగునో నీరసమే యగునో ముం దెవరు చూచి చెప్పఁగలరు? బిడ్డలు ఎట్టివారు పుట్టుదురో యని విచారించియే పెండ్లియాడుచుండిరా యేమి! బిడ్డలలో నొకఁడు సకలగుణపూర్ణుఁడై శాశ్వత కీర్తిసంపన్నుఁడగుచుండును. ఇంకొకఁడు వ్యర్థుఁడై నామరూపములులేక నశించుచుండును. అట్టులే సాహిత్యమందుఁ బూర్వకవికృతగ్రంథములలో నిస్సారములగున వెన్ని యంతరించియుండ లేదు! కావున వీనియందును నీరసములగునవి కొంతకాలమున కంతరించిపోవును. సరసములగునవియే నిలుచును. కావున నీ శంక యనావశ్యకము.

అయినను శీఘ్రకాలములో నీకొఱంతలు తీఱి సంగీతము కొంత యభివృద్ధిని గాంచుననుటకుఁ దగిన సూచన లగపడుచున్నవి. ఎట్లనఁగా:- సంగీతము వేశ్యలకొఱ కేర్పడెఁ గాని సంసారులకుఁ దగదనియు, పాఠకుల జీవనార్థ మేర్పడెఁ గాని పరువుగలవారికిఁ దగదనియు ననుకొనెడి నడుమవచ్చిన మూఢాభిప్రాయము లిపుడు ప్రజలనుండి దూరమగుచున్నవి. దీని యభిప్రాయమును, గౌరవమును బ్రజలకుఁ దెలియుచున్నది. సంసారులు అభ్యసించుచున్నారు. ముఖ్యముగ విద్యాధికులగు నవనాగరకులు తా మభ్యసించుటచేతను, తమ తోఁబుట్టువులకును బిడ్డలకును నేర్పించుటచేతను ఈ విద్యకుఁ దగిన గౌరవము నిచ్చుచున్నారు. మఱియు నీ విద్యామర్మముల గ్రంథశోధనచేఁ గనిపెట్టుచున్నారు. వీరలే యీ విద్య యం దింకఁ గొంచె మభివృద్ధిఁ గాంచినచోఁ బైఁజెప్పిన నిరర్థకనిరసనాది ప్రతిబంధకములు వీరల నేమైనఁ జేయఁగలవా? వీరి పేరు విన్నమాత్రంబుననే యవి పటాపంచలై పోవా? వీరలయందు విద్యాధిక్యము కలదు. గ్రంథశోధనఁ జేయఁగలరు. దేశమం దితరవిద్య లెట్టు లభివృద్ధియగుచుండెనో కనిపెట్టఁగలరు. యుక్తాయుక్తములు స్వయముగ విచారింపఁగలరు. అభివృద్ధికి నూతనమార్గములఁగల్పింపఁగలరు సంశయముగలప్పుడు దానిని బత్రికాముఖంబునఁ బ్రకటించి ప్రజాభిప్రాయముల నరయఁగలరు. కావున నట్టివారలే యీ విద్య నభ్యసించుచుండినచో నిది యభివృద్ధిఁ గాంచుననుటకు సందియము కలదా? అట్టి స్థితియు శీఘ్రకాలంబుననే కలుగు నని నమ్మఁదగియున్నది. అయిన నిట్టి నవనాగరకులందు సంగీతవిద్వాంసులు వెలువడుటకుఁ గాని, సంగీతవిద్వాంసులందు నవనాగరకతాచాతురీధురీణులు వెలువడుటకుఁ గాని యెట్లయినఁ గొంతికాలము పట్టక మానదు. అంతవఱకును విద్యాధికులగువారు తమ విద్యాబలమును బుద్ధిబలమును సంగీతవిద్వాంసుల సాధనబలమునకుఁ దోడుచేసి వారలకుఁ దగు ప్రోత్సాహము నొసంగుచుఁ బ్రతిబంధకములఁ దొలఁగించుచు వచ్చినచో దేశమందు సంగీతకవిత్వము నానాఁట నభివృద్ధిఁ జెంది శీఘ్రకాలముననే సమర్థములగు పెక్కు నూతనలక్ష్యములు కాలోచితముగ

వెలువడు ననుటకు సందియము లేదు. అట్టి సంకల్పమును నవనాగర కులకును సంగీత విద్వాంసులకును లోకపితయగు నా పరమేశ్వరుం డనుగ్రహించుఁ గాక.

ఉ. ఎక్కడఁ దప్పుకల్గునో మ ♦ ఱెక్కడ నెవ్వరు వంక లెంతురో
యక్కట కూడదంచుఁ గృతు ♦ లల్లకయుంట ప్రశస్థమా నే? సీ
ముక్కిడి పుట్టునో తనకు ♦ మూర్ఖుఁడు పుట్టునో యంచుఁ దొల్తనే
యక్కట పెండ్లియాడుట య ♦ నర్థకమంచును వీడు టొప్పునే ?



## MY HUMBLE SUGGESTION.

నా యొసంగు సలహా.



మన దేశమునందలి ప్రకృతకాలపు సంగీతస్థితిని జక్కఁబఱచుటకుఁ బ్రతిజిల్లాకు నొకటిగఁ గాని కొన్ని జిల్లాల కొకటిగఁ గాని కొన్ని సంఘములు "గాయకమహాజనసభలు" (Musicians' conferences) అను పేరి తోడ నేర్పడి యందు సంగీతవిద్వాంసులు తమతమ యభిప్రాయములను, సంశయములను, సలహాలను ధారాళముగఁ దెల్పుచు, ననంతర మొండొరుల విద్యాధిక్యములను ప్రతిభావిశేషంబులను గన్నులార జూచు భాగ్యము లభించునట్లొనర్చుట యావశ్యకమని సంగీతవిద్యాభిమానుల కెల్లరకు వినయపూర్వకముగఁ గొన్ని కారణములచే నేను సలహా యిచ్చుచున్నాఁడను.

ఇట్లు.
బుధజన విధేయుఁడు,
చేతపూడి – భగవంతరావు,
గ్రంథకర్త.

సర్వేజనా స్సుఖినో భవంతు.

# ప్రకటన.

| | | | |
|---|---|---|---|
| 1. రుక్మాంగద (నాటకము) | రు. | 1 | 0 |
| 2. మనుసంభవము (నాటకము) | | 1 | 0 |
| 3. కవిమిత్రము (అర్ధానుస్వార శకటరేఫ నిఘంటువు) | | 0 | 8 |
| 4. గానసారము (సంగీతోపన్యాసములు) | | 1 | 0 |

వీనిని వలయువారు గ్రంథకర్తగారికి దిగువవిధమున వ్రాసికొనవలయును. ప్రతులకొక ప్రతి యుచితముగ నీయఁబడును.

బేతపూడి భగవంతరావు,

మచిలీపట్టణము.